# హెచ్చరిక

శ్రీ పాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారి

చిన్నకథలూ,

నవలలూ,

నాటకాలూ,

చరిత్రలూ,

మీగడతెరకలూ,

ఖండకావ్యాలూ,

మెరుపు దెబ్బలూ,

వ్యాఖ్యానాలూ,

మొదలయినవి

లిఖితరూపంగా వారి అనుమతి పొందకుండా
భాషాంతరీకరణం, ప్రదర్శనం, బ్రాడ్
కాస్టింగు, స్క్రీనింగు, వగైరా యేవిధంగానూ
యెవరూ వుపయోగించుకోగూడదు

కలాభివర్ధనీ పరిషత్తు
రాజమండ్రి

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

మూడో సంపుటం

కథలు

కీలెరిగినవాత

ప్రకాశకులు

కలాభివర్ధనీ పరిషత్తు

రాజమహేంద్రవరం

# ప్రధాన పోషకులు

దివాన్ బహద్దరు

దురిశేటి శేషగిరిరావు పంతులుగారు

బి. ఎ., బి. ఎల్

కాకినాడ

# పోషకులు

మ॥ రా॥ శ్రీ తూములూరి శివరామయ్యాపంతులుగారు

బి. ఏ., బి. ఎల్., హైకోర్టు అడ్వకేటు నెల్లూరు

,, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు

ప్రొప్రయిటరు : వావిళ్ల రామస్వామి శాస్త్రులు

అండ్ సన్సు మదరాసు

,, ద్వారంపూడి రామారెడ్డిగారు

భూస్వాములు అనపర్తి

,, ఏడిద వేంకటరావు పంతులుగారు

భూస్వాములు రామచంద్రపురం

,, ద్వారంపూడి వేంకటరెడ్డిగారు

భూస్వాములు అనపర్తి

,, బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బి. ఏ.,

భూస్వాములు బుచ్చిరెడ్డిపాలెం

కీ॥ శే॥ సబ్బెళ్ల పద్దయ్యగారు

కొంకుదురు

,, కర్రి చిన వేంకటరెడ్డిగారు

రంగూన్

# శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు

## కీలెరిగిన వాత

"నీకేవిధ మైన ఆక్షేపణా లేనప్పు డిక యీ ఆలస్యం మెందుకూ ?" అని కొంచెం నిలవతీసిన ట్టడిగిందికృష్ణవేణి.

ఇలా అడిగినప్పు డామె మొగం ప్రసన్నంగా లేదు. ఆందోళన పుట్టించే ట్టే వుంది. అతని కాందోళన పుట్టనూ పుట్టింది.

కాని క్షణంలో మనస్సు కుదుటపరుచుకుని, యిదే మీ మెరగనట్టున్నా నటిస్తూ "అవసరం లేదు. నిర్హేతుక జాయమాన కటాక్షంతో దేవుడు ప్రసాదించిన వరం అనుభవించడానికి జాప్యం చెయ్యడం శుద్ధ తెలివితక్కువ" అంటూ ధీమాగా సంభాషణ సాగించా డతను.

"అదే యిప్పుడు జరుగుతూ వున్నది"

"ఒప్పుకున్నాను. నిజమే. అయితే, యీవిషయమై నీకంటే నేనే మెక్కువగా పరితపిస్తున్నాను. ఏమంటే ? నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను నేను. హృదయ పీఠంమీద ప్రతిష్ఠించుకుని నిన్నెప్పుడూ ఆరాధించు

కుంటున్నాను. ఇలాంటి స్థితిలో లోకం కోసం ఆకాస్త తంతున్నా నెరవేర్చడానికిలా ఆలస్యం కావడం యేమీ బాగా లేదు”

“నెల్లాళ్ళ కిందటా యీమాటే అన్నావు. వారం కిందటా యిదే అన్నావు. ఇప్పటి కిప్పుడూ—”

ముసముస లాడుతూ అందుకున్నా డతను.

“అబ్బా! కృష్ణా! నీకు కోపం వస్తే నేను తాళ లేను. నువ్వు నన్ను సందేహించావంటే యిక నీ మొగం చూడలేను.”

“నీ మొగం చూపించగలవు,......కదూ?” అంటూ చురచుర చూస్తూ అడిగిం దామె.

ఊచలాగ తగిలింది అతని కీ మాట. కీచు మని పోయాడు. ఆమె చూపులు భరించలేక మొగం పక్కకి తిప్పేసుకున్నాడు.

“నువ్వు, ముందుముందు, సంసారంలో చూపించ బోయే చాతుర్యాని కిది మచ్చు కాబోలునేం?”

పుండుమీద కారం చల్లిన ట్టయిం దతనికి; కాని ఒక్కమాటు సీత్కారం చేసి “యెంత మాట అనే శావూ?” అంటూ ఆమె కేసి మళ్ళీ మొగం తిప్పుకుని ప్రారంభించాడు.

"నా తపన నీ కేమీ అర్థం కాలే దన్నమాట. నా మానసికావస్థలు నువ్వు గమనించ తలుచుకోలే దన్న మాట. కృష్ణా! నిన్ను చూశాటప్పటికి నా కళ్లు జిగాల్ జిగాల్ మనిపోతాయి. మన స్సంతా గజిబిజి అయి పోతుంది; కాని నీ పరోక్షంలో నే నెన్నో కల్పనలు చేసుకుంటూ వుంటాను. అయితే యేమి లాభమూ? నీయెదటికి వచ్చాటప్పటికి—ముహూర్తం ఆలస్యం అయి పోతున్నందుకు నువ్వు కనబరిచే అసంతృప్తి చూశాటప్ప టికి నాకల్పన లన్నీ యెగిరిపోతూ వుంటాయి. నాహృద యం ముకుళించుకునే పోతుంది."

"అయితే యిదంతా యేమిటీ? ఈ వాక్ప్రవాహాని కర్థం యేమిటీ?"

ఆమెకి ముఖపిథానం చేస్తే గాని లాభం లేదనుకుని "నే నిప్పు డేమన్నానూ?" అంటూపరధ్యానం నటించా డతను.

కమ్మీ్మాపరచడమే కాకుండా అడ్డుప్రశ్న కూడా వెయ్యడంవల్ల భ్రాంతురా లయి "బాగుంది" అని మాత్రమే అని పులుకూ పులుకూ చూసిం దామె.

"కృష్ణా"అని పిలిచా డతను. ఆమె పలకలేదు. పైపెచ్చు మొగం పక్కకి తిప్పుకుంది.

"నువ్వు కోప్పడితే యిక నాపని యేమి కానూ?" అంటూ దోసిలి వొగ్గబోయినట్టు రెండు చేతులూ చాపి అడిగాడతను. దానిమీద ఆమె అతనికేసి మొగం తిప్పు కుంది; కాని కిందికి చూస్తూ వూరుకుంది.

దీంతో మళ్ళీ కొంచెం ధైర్యం కలిగిందతనికి. "మొత్త బడుతోం"దని లోకువ కూడా కట్టాడతను. ఈదిలా సాతో వెంటనే "నా మాట—" అంటూ ఆమె చెయ్యి పట్టుకోబోయాడు; కాని తన చెయ్యి వెనక్కి తీసుకుని ఆమె "దూరంగా వుండు; పెళ్ళి కాకుండా నువ్వు నన్ను తాకడానికి వల్లకాదు" అని దురుసుగా అంది.

"నీ సెలవు చొప్పున నడుచుకుంటాను. కాని అప్పటి దాకా తాళలేను, కనక—దయ వుంచి—కనికరించి— యిప్పటికొక్క ముద్దు—" ఇలా అని పెదవులు సిద్ధ పరుచుకుని అతను మళ్ళీ చేతులు చాపాడు. కాని "వల్ల కా"దని ఆమె కసిరినంత పని చేసింది.

ఆమె కేసి వొక్క క్షణం నిదానంగా చూసి "నా కిదేమీ అర్థం కావడం లేదు. ఇంతటి రూపరాశి— యింతటి ప్రేమనిధానం యింతటి కాఠిన్యం యెలా చూపగలుగుతోందో—అసలెలా పూనగలుగుతోందో

నా కర్థం కావడం లేదంటూ, చేతులు వేలవేసుకుని నిరుత్సాహం నటించా డతను.

"ఇదివర కెప్పుడూ లేంది, నీ కివాళ యీ కొత్త వికారం యేమిటోయ్ ?"

అతను జవాబు చెప్పలేకపోయాడు.

"నీకు భార్య కాని స్త్రీ చెయ్యి పట్టుకోవా లనీ, ఆమెని ముద్దుపెట్టుకోవా లనీ—యిలాంటి దౌర్బల్యం నీ కెందుకు కలిగిందోయ్ ?"

అతని కళ్ళల్లో సిగ్గు ప్రతిఫలించింది.

"అనుభవముద్ర వేసేస్తే యిక యేమిచేస్తే మాత్రం యేమి చెయ్యగలదనుకుంటున్నావా ?"

నిజంగా అతనికి గుండెలు చితికిపోయాయి.

కాని అతను చలించలేదు.

పక్కాలొక్కడు. గుండెలు తీసేసినాయిబ్బందిలేనిరకం.

కాగా, వెంటనే "సెబాస్" అంటూ అందుకున్నా డతను.

"నిన్ను మెచ్చుకుంటున్నాను. కృష్ణా! నీ శీలం నన్ను ఆనందపరవశుణ్ణి చేసింది. నిన్ను భార్యగా పడిసినవాడే పురుషుడు. ఆబిరుదు నాకే తక్కబోతూ వున్నందుకు గర్విస్తున్నాను. వివాహాని కిక క్షణం ఆలస్యమయినా నేను

తాళలేను. ఆ యేర్పాటు నువ్వెప్పుడు చేయిస్తే నేనా క్షణంలో సిద్ధం".

"అంటే?"

"ముహూర్తం స్థిరపరిపించి మీ నాన్నగారు ఎప్పుడు రమ్మంటే ఆ క్షణంలో—".

"నాన్నగారు అన్నీ క్షణంలో సిద్ధం చేయిస్తారు. మీ వాళ్ళతో చెప్పి, వీలు చూసుకుని నువ్వే ముహూర్తం స్థిరపరిపించాలి".

అతనికి వాగ్బంధనం అయిపోయింది.

"మాట్లాడవేం?"

"పోనీ ముహూర్తం నేనే స్థిరపరిపిస్తాను. అయితే యీ విషయంలో మీ నాన్నగారు నాతో యేమీ మాట్లాడకుండా—

"అలాంటి దేంతమాత్రమూ అవసరం లేదు. మీ సమ్మంధం నాన్నగారికి సర్వవిధాలా యిష్టమే. నాన్నగారి మాట అమ్మ యేదీ కాదనదు. నిన్ను పెళ్లిచేసుకోడానికి వారిద్దరూ నాకు సంబరపడుతూ సెల విచ్చారు."

"అది సరే. మీ సమ్మంధం మా నాన్న కూడా అంగీకరించాడు. మా నాన్న చేసింది మా అమ్మ

అంగీకరించక తప్పదు. కనక వుభయత్రా కూడా పెద్దల ఆటంకం యేమీ కనపడదు."

"ఇంక వున్న దేమిటీ?"

"ఈ స్థితిలో మీ నాన్నగారు నాతో గాని మా వాళ్ళతో గాని మాట్లాడవలసినపని లేదంటావా నువ్వు?"

"నా కేమీ కనపడ్డం లేదు."

"నువ్వు బాగా ఆలోచించలేదు. అసలు ఆలోచించి నట్టే కనబడదు. నిజానికి నన్ను నువ్వూ, నిన్ను నేనూ పెళ్లి చేసికోడాని కంగీకరించవలసినవాళ్ళం మనంయిద్దరమే. అయితే యితర యేర్పాట్లు—".

"ఇతరయేర్పా ట్లంటే?"

పాపం, మళ్లీ మొదలు!

కృష్ణవేణికి, యిందులో యేదో గూఢపురాణీ వున్నట్టు కనుపడింది. అన్నీ స్థిరపడ్డ తరవాత యిలాంటి ప్రస్తావన రావడం ఆమెకి విసువు కలిగించింది. "ఏమి టీ లౌక్యం?"అంటూ అసహ్యాభావం ప్రతిఫలించింది ఆమె మొగంమీద.

అత నిది గ్రహించాడు. ముస్తద్దీ వకీలు కాగల ననే ధైర్యం వున్న ఘటం అది.

"తెలవకే అడుగుతున్నావా నువ్వు?"

"తెలిస్తే అడగడం యెందుకూ ?"

అతనొక్కమాటు మొగంపక్కకి తిప్పుకున్నాడు.

మాంచి పకడ్డైన కల్పన తోచింది.

"ఇవాళ నువ్వు విషమ పరీక్ష మొదలుపెట్టావు. నాకు, దీని కేమీ కారణం కనపడ్డం లేదు"

"................."

"నీ హృదయంలో యెవరో సంశయబీజాలు వెద చల్లారు"

ఆమె ఫులుకూ ఫులుకూ చూసింది.

"నా సుఖంలో–నా ఆనందంలో నిగ్గంతా యెవరో విరిచేశారు"

"సోది తొరగా ముగించవోయ్" అన్నట్టు చూసింది.

"కుచ్ఛితం లేని హృదయం నాది. కల్మషం యెరగని ప్రేమ నాది. అగ్గికి చద లంటవు. నాహృదయం చీల్చి చూపించి అయినా నేను మళ్లీ నిన్ను ప్రసన్నురాలుగా చేసుకోగలను"

"...................."

"నీ చదువు చూసి నేను ఆశపడలేదు. నీ సౌందర్యానికి చలించి నేను నిన్ను ప్రేమించలేదు. ఆవేళ, నువ్వు గోదావరి గట్టున, నిండు చూలా లయిన బిచ్చకత్తెకు,

అప్పుడే కొని తెచ్చుకుంటున్న విలవైన చీరా, చేసంచిలో నుంచి తీసి అయిదు రూపాయలూ సంతోషంతో యిచ్చావు. ఆ డబ్బుతో ఆమె నిర్విచారంగా పుడుడు పోసుకుంటుందని నువ్వు పరమానందపడ్డావు. నే నదంతా కళ్లారా చూశాను. అదే నాకు నీ మొదటి దర్శనం. నాహృదయం నీయెడల ముగ్ధ మయిపోయింది. నాఆత్మ నీపాదాలమీద ఆనందబాష్పాలు చిలికింది. చెప్పవచ్చిం దేమి టంటే? అలాంటి గొప్ప ఔదార్యం పునాదిగా గల ప్రేమ నాది. దీని కిక తిరుగులేదు. దీని కెవరూ యెంత మాత్రమూ విఘాతం కలిగించలేరు. నా ప్రేమ నీ భావోన్నతి తప్ప మరేమీ చూడదు. కోరదు"

ఆమె కేవగింపు పుట్టింది. దాన్ని ఆమె దూరంగా తరిమివెయ్యా లేక పోయింది.

"గొప్ప సినీమానటుడికి కావలసిన యోగ్యత అంతా నీదగ్గిర వుంది" అని ఝుమాయించి అనేసింది.

గతుక్కు మన్నా డతను.

"నువ్వింత గొప్పవక్త వనినే నెప్పుడూ అనుకోలేదు."

"కృష్ణా! నన్నేం చెయ్య మంటావూ? నావల్ల యేమి పొరపాటు జరిగింది?"

ఆమె కిది యద్దేవా, అనిపించింది.

"నీవల్ల యేమీ జరుగలేదు."

ఇలా అని, ఆమె, యిటూ అటూ చూసింది. మరి మాట్లాడకుండా వెళ్లిపోయే టట్టుం దని అతను కంగారు పడిపోయాడు.

"వద్దు వద్దు, నీకు కోపం వద్దు. కాస్త లోకాచారం గమనిస్తే అంతా నీకే బోధపడి వుండును."

"..................."

"ధోరణి చూడగా, నా నోటనే చెప్పించా లని నీ అభిలాషగా కనపడుతూ వుంది. అలాగే కానిద్దాం. నీ ఆజ్ఞ నెరవేర్చడం కంటే సంతోషకర మయినది నాకు మరొకటి లేదు."

"..................."

అప్పటికీ ఆమె పక్కకే చూస్తూ వుండడంవల్ల అతను తానున్న ఆమె మొగం కనపడేటట్టు పక్కకి వొరిగి "మనవి చేసుకుంటున్నా" నన్నాడు.

"వింటున్నా" నని ఆమె యెదటికి తిరిగింది.

"నువ్వు యింటరు చదివా టప్పుడు, మీనాన్నగారు, నిన్ను గొల్లకోట సదాశివచయనులుగారి అబ్బాయి కివ్వ దలిచి,కట్నం రెండు వేలూ, లాంఛనా లయిదువందలూ యిస్తా మని కభురు పంపించారు"

ఆమెకి, కళ్లు గంతలు విప్పేసిన ట్లయింది.

"అవును. అది వెనకటి మాట"

"మరి యిప్పటి మాట యేమిటీ?"

ఆమె పెదవులు రావి రేకల్లాగ కదిలాయి. పెద్ద నిట్టూర్పు విడుస్తూనే కాని "కట్నం మాటా?" అనలేక పోయింది.

ఆమెలో కలుగుతున్న మార్పు గమనిస్తూ అత నూరుకున్నాడు.

"నీకు కట్నమూ, మీ అమ్మకీ,అక్కకీ లాంఛనాలూ యెంతెంత యిస్తా రనా?"

"..................."

"నువ్వు నన్ను పెళ్లి చేసుకోవా లంటే మానాన్న గారు నీకు డబ్బివ్వా లంటావా?"

"..................."

"అవి నిర్ణయం కాకపోవడంవల్ల నే నువ్విలా కాలం గడుపుతున్నా వన్నమాట......నిర్ణయం అయే దాకా గడుపుతూనే వుంటా వన్నమాట"

"కాకేం?" అన్నట్టు చూశా డతను.

"కదూ?" అని ఆమె గదుముతూ అడిగింది.

"అవు నలాగే" అని నిర్లక్ష్యంగా జవాబు చెప్పాడతను.

కింది పెదవి కొరుక్కుంటూ ఆమె మళ్లీ పెద్ద నిట్టూర్పు విడిచింది. దాంతో ఆమె వక్షస్థలం అదిరింది.

"మానాన్నగారు దమ్మిడీ కట్నం యివ్వరు"

"...................."

"వారి దగ్గిర యీమాట యెవరు తెచ్చినా మాట తక్కదు."

"......................"

"ఈమాటను నేను కూడా గర్హిస్తున్నాను."

ఈమాట లామె యెంత నిక్కచ్చిగా అన్నదో "అలాగేం?" అని అంత నిక్కచ్చిగానే అని అతను ప్రారంభించాడు.

"నే నేం లేని వాణ్ణా? కానివాణ్ణా? కురూపినా? చదువు లేనివాణ్ణా? పాతిక సంవత్సరాలు మొన్ననే నిండాయి, నాకు పెళ్లి కాదని బెంగా? నా వాటా భూములమీద సాలీనా వెయ్యి రూపాయలు వస్తాయి. నా కొక యిల్లు కూడా వస్తుంది. నేను సొంతంగా ప్రాక్టీసు పెట్టుకుంటే వెంటవెంటనే పెద్దపెద్ద కేసులు డజన్ల కొద్దీ వచ్చే సూచనలెన్నో వున్నాయి. ఇలాంటి స్థితిలో కట్నం లేకుండా

పెళ్లి చేసుకుని, నేను, సాటివాళ్లలో తలయెత్తుకు తిరగ్గలనా ?"

"ఏమి పౌరుషమూ!" అంటూ ఆమె వెటకారంచేసింది.

అతను వుద్రిక్తత కనపరిచాడు.

"నీలాంటి పౌరుషవంతులే నీ స్నేహితు లందరూ అనుకుంటాను."

"అవును, ఏం తక్కు వేమిటి!"

"నల్ల పుద్ధరి తప్ప, యెక్కువ కావడాని కయినా తక్కువ కావడాని కయినా పౌరుషం వున్న దేదీ?"

అతని వొళ్లు ఝల్లుమంది.

"ఒక కన్యను పెళ్లిచేసుకోడాని కిష్టపడ్డందుకు మొగాడికి కట్నం యెందు కివ్వాలీ?"

"మొగాడు కనక."

"ఛీ ! అదీ మొగతనమే?"

"................."

"ఇరవయ్యో శతాబ్దిలోకూడా హిందూ మొగాడు—బ్రాహ్మణ మొగాడు ఇంత పశువుగానే వున్నాడా?"

అతను వెటకారంగా నవ్వాడు.

"స్త్రీధనం వల్ల జీవించతలుచుకునే నువ్వు స్త్రీని స్మరించడాని కేనా తగవు."

"హు, హు. స్త్రీ—ధనం. స్త్రీధనం అంటే మొగుడు పెళ్లాని కిచ్చేది. కన్యాదాత వరుడి కిచ్చేది కాదు. స్త్రీ ధనం అంటే యేమిటో యెరగని బి. యే. ఆడదాన్ని పెళ్లాడ్డంకంటే అవివేకం మరొకటి లేదు. ఒప్పు కున్నాను".

"నేను గోతిలో పడిపోకుండానే నీ నిజస్వరూపం బయట పెట్టినందుకు చాలా సంతోషం."

"నేనూ అందుకే సంతోషిస్తున్నాను."

"నువ్వు సుందరుడ వంటే కనపడుతూనే వుంది; కాని నీకు ఆత్మసౌందర్యం లేదు. చదువుకున్నవాడ వంటే అదీ కనపడుతూనే వుంది; అయితే, నీ చదువు నీకు చిత్తసంస్కారం కలిగించలేదు. అడవిలో కాసిన వెన్నెల అయిపోయింది."

"నువ్వధిక ప్రసంగం చేస్తున్నావు. నీ తండ్రి జిల్లాజడ్జీ పని చేసి వుంటే యెవరికీ వొరగలేదు. నువ్వు బి. యే నని గర్విస్తున్నా వేమో బుద్ధిగా మసులుకోకపోతే గుడ్డిగవ్వకు మారవు. మంచి మొగుడు రావా లంటే పళ్ళబేర మనుకుంటున్న ట్టున్నావు. అబ్బో! గుఱ్ఱం దిగు"

"నువ్వు మాట్టాడతగ్గవాడవు కావు. నా యెదణ్ణుంచి తక్షణం వెళ్లిపో"

"పొద్దున్నే లేచి—"

"ఫో! నుంచోకు"

అతను వాగ్వాదానికి జంకేవాడు కాదు; కాని నమ్మించి నమ్మించి తన ద్రవ్యాశ యిప్పుడు బయట పడిపోయి— పై పెచ్చు వ్యవహారం యెదురు తిరిగినందు కతనికి కొంచెం సిగ్గు వచ్చింది. కట్నం మాట కృష్ణవేణి తండ్రి గాని, మరొక పురుషుడు గాని తిరస్కరించి వుంటే అందులో యింత తీవ్రతా లేకపోవును, అతనికి కోంకు పుట్టకా పోవును. అలా కాక, సూటిగా వధువే నీకు మొగతనం లేదనడం అతనికి కొట్టినంతపని అయింది.

వూచలాగ వెళ్ళిపోయాడు.

కృష్ణవేణి పదినిమిషాల దాకా శాంతించలేకపోయింది. విసురుగా వెడుతూ అతగాడు కనపడ్డంత సేపూ, ఆమె, తోకతొక్కిన ఆడతాచు లాగ బుస్సలు కొట్టి, తరవాత "నీచుడా" అంటూ గిరుక్కున తిరిగి యింటికి వెళ్ళిపోయింది.

## ౨

కృష్ణవేణి వీధిలోనుంచీ, ఆమె తల్లి రాధమ్మ వంటింటి వసారాలోనుంచీ వచ్చి దక్షిణపు వసారా గదిలో వొక్కమాటే ప్రవేశించారు.

కృష్ణవేణి అతివేగంగా వెళ్ళి సోఫామీద చదికిల బడింది. రాధమ్మ, ఆమె వాలకం చూసి కంగారుపడి, టీపాయి మేజామీద పెట్టేసి "యేం తల్లీ!" అని దగ్గిర కూచుని "అలా అయిపోయినా వే మమ్మా!"అంటూ వీపు నిమురుతూ అడిగింది.

"సమ్మంధం తిరిగిపోయింది"

"అయ్యో!"

కృష్ణవేణి ఆర్ద్రైన్యానికి రోషం తెచ్చుకుని తిరగబడి తీవ్రంగా చూసింది.

"ఏం?"

మొగంమీద మొగం పెట్టి యిలా అడిగింది రాధమ్మ.

"వాడికి కట్నం కావాలి ట"

"ఇదివరి కీమాట రాలేదు గదమ్మా! అయినా యెంతట?"

"వాడి తలకా యంతట ... ఎంతయితే మాత్రం యివ్వడాని కివతల పడిగాపులు పడి కూచున్నారా యేమిటి?"

రాధమ్మ మాట్లాడలేకపోయింది. ఇరవై యేళ్ల కూతురికి కుదరక కుదరక కుదిరిన సమ్మంధం తిరిగి పోయిం దనేటప్పటికి ఆయిల్లాలి తల తిరిగిపోయింది.

ఇదేమీ గమనించకుండా యేదో వుత్తరం రాసి కవరులో పెడుతున్న రామచంద్రయాజులు, యీ మాట విని వులిక్కిపడి, లేచి వెళ్లి కూతురి దగ్గిర కూచుని "అతనే అడిగాడా తల్లీ!" అన్నాడు.

"అవును. వాడే అడిగాడు. వాడితల్లికీ, అక్కకీ లాంఛనాలు కూడా యివ్వాలిట నాన్నా హా"

"చీమూ నెత్తురూలేని తుమ్మగుంగ. ఎందుకు వచ్చిన చదువూ?!"

యాజులు కూడా యిలా అనడం రాధమ్మకి వుద్ధూరంగా కనపడింది. దీంతో యీ సమ్మంధం విషయమై ఆమె పూర్తిగా నిరాశ చేసుకుంది.

యాజులు రాధమ్మ యింగితం కనిపెట్టాడు; కాని లెక్కచెయ్యా తలుచుకోలేదు. ఈ విషయమై ఆమె సలహా చెప్పతగ్గది కా దని అతను మొదటే నిశ్చయించేసుకున్నాడు.

"ను వ్వేమన్నా వమ్మా?"

"నీ మొగంచూడగూడదు, అవతలికిపో అన్నానండీ"

"మంచి పని చేశావు"

రాధమ్మ మొగుడికేసి వులుకూ వులుకూ చూసింది; కాని మొగం పక్కకి తిప్పుకుని వుండడంవల్ల అత నది

గమనించలేదు. కృష్ణవేణి మాత్రం కనిపెట్టి "నువ్వే మంటావూ?" అన్నట్టు వురుముతూ చూసింది.

"కాలం......కాలం యిలా మండిపోతోంది. మా అమ్మాయిని మీ అబ్బాయి కివ్వతలుచుకు వచ్చా మనేటప్పటి కే మిస్తా వని—"

"ఆ అబ్బాయిగాడే అలా యేడిస్తే!"

కృష్ణవేణి చాలా దురుసుగా అడిగిం దీ మాట.

"నిజం చెప్పు. అతగాడు కట్నం కావా లంటే నువ్వేమన్నావూ!"

"నాన్నారితో చెప్పిందే. "నీ మొగం చూడగూడదు పో పో" మ్మన్నాను"

"నిజంగా యీ మాటే అన్నావా!"

"అనక యేం భయమా? వెంటనే వా డవతలికి చల్లగా జారుకున్నాడు కనక సరిపోయింది. లేకపోతే యేం జరుగునో?"

ఒకమాటకంటే వొకమాట రాధమ్మని దిగదీశాయి. చివరి కామె నిరాశ చేసుకుని "ఆడదాని కంత దురుసుతనం పనికిరా దమ్మా" అండి.

ఇదివిని "విన్నారా!"అన్నట్టు కృష్ణవేణియాజులు కేసి

చూసింది. యాజులు రాధమ్మ కేసిచూస్తూ "యెంచేతా?" అన్నాడు.

"ఏం చేసినా మొగాడికి చెల్లుతుంది"

"ఆడది చెల్లని స్తేను...........అంతే కాదూ?"

"ఎఫ్ఫే, బి. యేలు చదువుకుంటే మాత్రం ఆడపిల్ల లంతా యిలా అంటున్నారా?"

"అనని వాళ్లనుభవిస్తారు. అడిగే దేమిటి, చెప్పే దేమిటి?"

"ఇప్పు డమ్మాయి మాట చెప్పండి"

"గొప్ప ఆశయాలు గల పిల్ల—"

మాట సగంలో అందుకుని, కృష్ణవేణి "మీరుండండి నాన్నగారూ"అని తల్లి కేసి తిరిగి "అమ్మాయి కేం లోటు వచ్చిం దమ్మా యిప్పుడూ?" అని నిక్కచ్చిగా అడిగింది.

"పెళ్లి లేకుండా యింటో కూచుంటావా?"

"పెళ్లాడితే యిలాంటి దేబెలనా?"

"మొగపిల్ల లంతా యిప్పు డిదే మచ్చు"

"వాళ్ళ మొగతనం అడుక్కు తిన్నట్టే వుంది"

"ఇంకేం చెప్పగలనండీ?" అన్నట్టు రాధమ్మ యాజులు కేసి చూసింది. "అమ్మాయి సిసలుగా చెప్పింది. ఏం, అలా చూస్తా వే?"మని యాజులు ముదలకించాడు.

"దాని చదు వింత పని చేసింది"

"అవును, నువ్వు సరిగా చెప్పావు. చదువుకుని జ్ఞానం వచ్చిన ఆడపిల్ల యిలాగే చెయ్యాలి, ఇలాగే చేస్తుంది"

యాజు లీమాట వొత్తి పలికాడు.

"చదువుకుంటే మొగు డక్కర్లేదూ?"

"మొగాడికి పెళ్లాం అక్కర్లేదూ?"

"మొగాడికి పెళ్లి కాకపోతే యేదీ అడ్డదు. ఎవరూ యేమీ అనరు. అనే లేరు"

"చివరి కిదీ ముక్తాయింపు. దీనిమీదే వొంటికాలి భరతం చెలామణీ అవుతూ వుంది. సంఘం పూర్తిగా కుళ్లిపోయి వుంది. కొన్నాళ్ళదాకా యెదురు తిరిగిన వాళ్లు కొన్ని యిబ్బందు లనుభవించక తప్పదు; కాని యింకెన్నాళ్లూ యీ దౌర్జన్యం?"

"మాట్లాడితే వుపన్యాసాలు. మీతో నేను వాదించ లేను బాబూ! అయితే, చివరికి అమ్మాయికి పెళ్లి చేస్తారా చెయ్యరా?"

"మళ్లీ యిలా వచ్చావూ? అయితే, నీ కెలా తోస్తోంది చెప్పు"

"కట్నం యిస్తే గాని మంచి సమ్మంధం రాదు.

మంచి దాకా యెందుకూ, మీా తాహాతుని బట్టి కట్నం యిస్తే గాని అసలు సమ్మంధమే రాదు"

"వచ్చిన ధోరణి వొకటీ, అడిగిం దొకటీ, చివరికి జవాబు మరొకటీనీ. అయితే యేం గాని, నీ కిదివర కెన్నో మాట్లు చెప్పే వున్నాను గాని—నేను దమ్మిడీ యివ్వను. ఆమాట కూడా వినిపించుకోను"

చెయ్యి జాడిస్తూ యాజు లిలా అనగా "అయితే, అమ్మాయికి మొగుడు రా" డంటూ, రాధమ్మ గుర్రా లక్కలాగ మొగం పక్కకి తిప్పుకుంది.

"మొగుడు.........మొగా డయి పుట్టిన ప్రతీ వాడూ మొగు డయిపోడాని కర్హుడే కాబోలు! ఆడాళ్లంటే పురుగులా? ప్రతీ ఆడదీ యేతలమాసిన వాణ్ణో కట్టుకోక తప్ప దేం?"

ఇలా అంటూ కృష్ణవేణి తల్లి ని నిలవతీసి అడిగింది.

ఒక్క క్షణం యెవరూ యేమీా మాట్లాడలేదు.

మరో క్షణం చూసి, రాధమ్మ కప్పుల్లో కాఫీ పోసి, భర్తనీ కూతుర్నీ మేజా దగ్గిరికి పిలిచి తా నొక కుర్చీలో కూచుంది.

ముగ్గురూ —పెదవులు కదపకపోలేదు; గాని మాట

మాత్రమే రాకుండా చూసుకుంటూ మెల్లిమెల్లిగా కాఫీ పుచ్చుకున్నారు.

తల్లి "నే నిస్తా నుండ వమ్మా" అంటూనే వుండగా, తల్లికీ తండ్రికీ తానే తమలపాకు లందించి, తానున్నా వేసుకుని, కృష్ణవేణి, స్వయంగా కారు నడుపుకుంటూ పాఠశాలకి వెళ్లిపోయింది.

రాధమ్మ వొక్క క్షణం యేమిటో ఆలోచించి "నే నొక్కటి చెబుతా వింటారూ!" అంటూ తన కుర్చీ యీజులు దగ్గిరగా లాక్కుంది.

## 3

కృష్ణవేణి బి.యే పరీక్షలో నెగ్గి రెం డేళ్లయింది. మద్రాస్ క్వీన్ మేరీ కాలేజీలో చదివే టప్పుడు, ఆమె ప్రతిభా చాకచక్యమూ దీక్షా చూసి, ప్రిన్సిపాలు, ఆమెని కన్న కూతురులా ప్రేమించింది.

పట్టం పుచ్చుకుని ఆమె రాజమండ్రీ వచ్చేస్తూ వుంటే "నేను నిన్ను విడిచిపెట్టలేను. నిన్ను ఎం. ఏ. లో నెగ్గించి యీ కాలేజీలో నాకు చేదోడు వాదోడుగా వుంచు కుంటాను. వెళ్లిపోకు" అని చాలా దూరం చెప్పింది.

బతిమాలింది; కాని కృష్ణవేణి వినలేదు. "నేను ఎం. ఏ. లో నెగ్గితే నా కేం వస్తుంది? నే నీ కాలేజీలో ఉపాధ్యాయురాలుగా చేరితే నా దేశీయస్త్రీల కెంత మందికి జ్ఞానదానం చెయ్యగలనూ? మీకు కోపం వద్దు. ప్రస్తుత విద్యావిధానం యేమీ బాగాలేదు. ప్రత్యేక జన్మ యెత్తినవాళ్ళ కేగాని కాలేజీలో ప్రవేశం దొరకడం లేదు. ప్రవేశించినవాళ్లేనా అందరూ వుద్యోగాలకోసం ఆశించి వచ్చేవాళ్లే. ఇది నాకు నచ్చలేదు. మా వూళ్లో నే నొక పాఠశాల నడుపుతాను. ప్రారంభోత్సవం చెయ్యడానికి మిమ్మల్నే ఆహ్వానిస్తాను. నా విద్యా విధానం అప్పుడు మీకు తెలుస్తుంది" అని ఆమె బదులుచెప్పింది.

ప్రిన్సిపాలు చివరికి ఆమెని సంతోషంతో దీవించి పంపించింది.

ఆమె యింటర్మీడియేటు చదివా టప్పుడు యాజులు వివాహసంకల్పం చేశాడు; కాని "చదువు పూర్తి కానివ్వండి నాన్నారూ" అని కోరగా ఆప్రయత్నం ఆ క్షణంలోనే మానేశాడు.

ఆమె బి. ఏ. అయి యింటికి వచ్చాక యేడెనమండు

గురు యువకులు ఆమె నాశించి వచ్చారు; కాని ఆసమ్మంధాలు చివరికి రాధమ్మకేనా నచ్చలేదు.

ఇది యిలా జరుగుతూ వుండగా కృష్ణవేణి తన వుద్దేశాలు స్త్రీలోకంలో వ్యాపింపచెయ్యాలని వొక పాఠశాల ప్రారంభించింది.

యాజులు, తన పెన్షను యెనిమిది వందలలోనూ "నీ యిష్టం వచ్చినట్టు చేసుకో"మని కూతురికి, నెలకి రెండు వందల యాభై రూపాయ లిస్తూ వుండడాని కేర్పాటు చేశాడు.

ఆమె, ఆడబ్బుతో, నెలకి యాభై, ముప్ఫయి, యిరవయి రూపాయల జీతం చొప్పున ముగ్గురు వుపాధ్యాయురాళ్ళ నేర్పరచింది. ఆడనౌకరుకి నెలకి పది రూపాయలు. చిల్లరసాదర్లు డెబ్భయి అయిదు రూపాయలు.

ఇలాగ, తండ్రి తన కిచ్చే సొమ్ములో, ఆమె, పాఠశాలకోసం నూటయెనభై అయిదు రూపాయలు ఖర్చు పెడుతుంది. తతిమ్మా సొమ్ము తన సొంతానికి పుష్కలంగా ఖర్చుపెట్టుకుంటుంది.

కూతురి యేర్పాట్లు చూసి యాజులు "ధన్యుణ్ణి" అని పొంగిపోయాడు.

కొంచెం యింగ్లీషు, దానికి రెండు రెట్లు తెనుగు—ఇంతే పాఠశాలలో ఆమె ప్రవేశపెట్టిన భాషాపరిమితి.

స్త్రీలు, అవసరమయితే పురుషులు లాగ స్వతంత్రంగా బతకా లని ఆమె వుద్దేశం.

"దయ వుంచి నన్ను పెళ్లి చేసుకో. నన్నుద్ధరించు" అంటూ స్త్రీ పురుషుణ్ణీ, పురుషుడు స్త్రీనీ బతిమాలుకో నక్కరలేదు. ఏమంటే? పురుషుడి అవసరం స్త్రీకీ వుంది. స్త్రీ అవసరం పురుషుడికీ వుంది. కనక స్త్రీ పురుషసంబంధమైన ఆకర్షణకి మనుష్యప్రయత్నా లేమీ అక్కర్లేదు. ఇప్పటి తెనుగు స్త్రీలు పురుగుల కంటే నికృష్టంగా వున్నారు. మతసంబంధమైన మూఢనమ్మకాలలా వుండగా, పురుషుల స్వార్థం కూడా వారిని పశువుల స్థితికి తీసుకు వెళ్లింది. వారికి దేశం అంటే తెలవదు. జాతి అంటే తెలవదు. భాష అంటే తెలవదు. మతం అంటే తెలవదు. సంఘం అంటే తెలవదు. ప్రపంచం యెంత విశాలంగా వుందో, అందులో యెలాంటి సంగతు లున్నాయో, వారికి సుతరామూ తెలవదు. మొగుడు వీధిగుమ్మంలో నుంచుని వుంటే గాని నడివీధిలో నిటాగ్గా నుంచోలేరు. నలుగురు సాయం పడితే తప్పసొంతంగా పక్కవూ రయినా వెళ్లలేరు. చివరికి

యింటికివచ్చిన బిచ్చగాణ్ణి కూడా గదమాయించలేరు.

ఇదిమార్చాలి.

ఇదీ ఆమె వుద్దేశం.

ఆమె యిందు కనుకూల మైన విద్యావిధానం యేర్ప రిచింది.

ఇందుకోసం ఆమె, ప్రపంచంలో గొప్పపనులు చేసి పేరుపొందిన స్త్రీల చరిత్ర లన్నీ సంపాదించింది. స్త్రీల స్వత్వాలను చక్కగా నిర్వచించి, వాటిని తమ జీవిత కాలంలో అమలు జరిపి, ప్రపంచాని కాదర్శభూతురా ళ్లయిన స్త్రీల జీవితాలుకూడా సంపాదించింది.

అవన్నీ తాను స్వయంగా తెనుగులో రాసింది.

కొన్ని అచ్చుపడ్డాయి. కొన్ని అచ్చులో వున్నాయి. కొన్ని రచనలో వున్నాయి. కొన్ని విషయాలు సేకరించు కునే దశలో వున్నాయి.

అవే ఆమె తరగతుల వారీగా తన పాఠశాలలో పాఠ్యాలుగా నిర్ణయించింది. దానికి తగిన లెక్కలు, భూగోళం, చరిత్ర, భాష, ప్రకృతిశాస్త్రాలు, సంఘపు కట్టుబాట్లు—ముఖ్యంగా ఉదయమూ, సాయంత్రమూ వ్యాయామం.

ఆమె, పాఠశాలకోసం వొక గుర్రం సంపాదించింది.

నాలుగు సైకిళ్లూ ఒక (సొంత) మోటారూ వున్నాయి. గుర్రపుస్వారి, సైకి లెక్కడం, మోటారు నడపడం — ఇవి ఆమె ప్రతీపిల్లకీ కచ్చితంగా నేర్పుతుంది.

ఆ పాఠశాలలో చదువుకునే బాలికలు చాలామంది, దర్జాగా, సొంత సైకిళ్లమీద వస్తారు. వారిని చూడ గానే రాజమండ్రీ పోలీసులు జనసమ్మర్దం చక్కగా సద్దు తారు.

మునిసిపాలిటీతో పోరీ, గవర్నమెంటుని వుాదరగొట్టి ఆమె గోదావరి వొడ్డున, నాళంవారి సత్రం రోడ్డుకి కిందుగా యాభయి గజాల రేవు సంపాదించింది. మునిసి పాలిటీవారే దానికి దక్షిణానా, వుత్తరానా ముళ్లతీగ లతో దళ్లు కట్టించి హద్దు లేర్పరిచారు. దానిలో బాలి కల వుపయోగం కోసం వొక షెడ్డు కూడా నిర్మించి యిచ్చారు.

ఆమె ప్రతీరోజునా ఉదయమూ సాయంత్రమూ ముఠా ముఠాలుగా పిల్లలను తీసుకువచ్చి యీత కొట్టి స్తుంది. ఆ సమయంలో అక్కడ వొక పోలీసు వుండి కాపలా కాస్తూ వుండేటట్టు జిల్లా మాజిస్ట్రేటు నియ మించాడు.

అక్కడ పడవ లాగకుండా చెయ్యడమూ, నీళ్ళ

కోసం గాని స్నానాలకోసం గాని యెవరూ అక్కడికి రాకుండా చూడడమూ పురుషులు చూడడానికి రాకుండా ఆపడమూ—ఇవీ ఆ పోలీసు పనులు.

పెద్దపెద్ద లంతా ఆమె పాఠశాలను దీవించారు. గొప్ప పత్రికలు కొన్ని ఆ యేర్పాట్లు ప్రశంసించాయి.

కాని ఆ పాఠశాలలో బ్రాహ్మణబాలికలు అయిదుగురు మాత్రమే వున్నారు. తతిమ్మావారు—అంటే క్షత్రియబాలికలు పదహేనుగు రున్నారు. వైశ్యబాలికలు ఇరవై మంది. తెలగాలు, కమ్మవారు, గొప్ప వెలమలు డెబ్భయ్యిద్దరు.

ఉదయం మూడుగంటలూ మధ్యాహ్నం మూడుగంటలూ ఆమె పాఠశాలలో చెమట వోడేలా పని చేస్తుంది. అక్కడి పను లన్నీ మార్షల్‌లా ప్రకారం నడుస్తాయి. ఎక్కడా చచ్చు పనికిరాదు.

పాఠశాల గంటల్లో స్త్రీలు మాత్రం వెళ్లి గాలరీలో నిశ్శబ్దంగా కూచుని వినీ, కనీ బాగుపడవచ్చు.

చాలామంది వస్తూనూ వుంటారు.

అప్పుడప్పు డామె వీరేశలింగం పంతులుగారి టవున్ హాల్లో వుపన్యాసా లిస్తూ వుండడం కద్దు. అయితే ఆమె

నోరు విప్పిందంటే జీవచ్ఛవ ప్రాయమయిపోయి వున్న సంఘం మీద అగ్గి రాలుతూ వుంటుంది.

## ౪

మధ్యాహ్నం వొంటి గంటవేళ, కృష్ణవేణి, వొక పుస్తకం తాలూకు ప్రూఫు దిద్దుతూ వుండగా యాజులు వచ్చి ఆమె కొక వుత్తరం యిచ్చాడు.

అందులో యిలా వుంది.

“బ్రహ్మశ్రీ మహారాజశ్రీ చేబోలు రామచంద్ర యాజులు పంతులు, రిటైర్డు జిల్లా జడ్జీగారి సన్నిధికి,”—

అయ్యా! అనేక నమస్కారాలు.

తమ కెరిగి వున్న మద్దూరి వేణుగోపాలశాస్త్రీ నేనూ స్నేహితులం.

తమ అమ్మాయి కృష్ణవేణిగారికీ తనకీ వివాహం స్థిరపడి వుండినట్టూ, ముహూర్తం స్థిరపరిపించడమే తర వాయిగా వుండగా కట్నం విషయమై పేచీ వచ్చి సమ్మంధం తిరిగి పోయినట్టూ, తాను అదివరకే రెండు వేల కట్నమూ అయిదు వందలు లాంఛనాలూ యిస్తామని తరిమి తరిమి చెబుతూ పట్టుకు పాకులాడుతూ వున్న మరో సమ్మంధం వెంటనే స్థిరపరుచుకున్నట్టూ, ముహూర్త

నిశ్చయం కూడా అయిపోయినట్టూ యిప్పుడే చెప్పి వెళ్లాడు.

నే నీ పుత్తరం తమకి రాయడానికి యీవిధంగా కారణమూ, అవకాశమూ కలిగాయి.

నేను మీ అమ్మాయిగారిని పెళ్లిచేసుకోవా లని అభిలషిస్తున్నాను.

నన్ను మీ రెరుగుదురు. మీ అమ్మాయిగారున్నూ యెరిగే వుంటా రని నమ్ముతున్నాను.

నా పేరు సుసర్ల కోటీశ్వరశాస్త్రి. మా స్వస్థలం అమలాపురం తాలూకా మోడేకుర్రు గ్రామం నేను బి. ఏ. ఎల్. టి పరీక్షలో నెగ్గివుండి, ప్రస్తుతం, రాజమండ్రీ మునిసిపల్ హైస్కూల్లో ఆక్టింగుగా పని చేస్తున్నాను.

ఇది యెప్పుడు ఖాయం అవుతుందో చెప్పలేను; అయితే, యీ ఆక్టింగు మాత్రం యింకా కొన్ని సంవత్సరాలు జరుగుతుంది.

నాకు, భూములమీాద, సంవత్సరానికి రెండు వందల రూపాయలు మాత్రమే వస్తాయి. స్వగ్రామంలో చిన్న పెంకుటిల్లున్నూ వున్నది.

నావయస్సు: ముప్ఫయి రెండో యేడు మొన్న నే జులైలో ప్రవేశించింది.

రెండేళ్ల కిందట నా మొదటి భార్య గతించింది. సంతతియేమీ లేదు. కలగనే లేదు.

అరవై యేళ్ళ అమ్మగారూ, నలభయి యేళ్ళ వితంతు సోదరీ, నేనూ—ఇంతే మాయింటో జనం.

నాకు కట్నం అక్కర్లేదు. లాంఛనాలు పని లేదు.

పెళ్లికి, నేను ఖర్చుచెయ్యతలిచిన—కలిగిన పెద్ద మొత్తం నూరు రూపాయలు.

నా యోగ్యత తమ కందరికీ నచ్చి, నా స్థితి విషయమై కూడా సంతృప్తి కలిగితే నేను తమ అమ్మాయి గారిని పెళ్లి చేసుకోవా లని ఆశతో వున్నాను.

నేను రేపు మధ్యాహ్నం రెండు గంటలవేళ మీ దర్శనానికి వస్తాను.

నా విషయమై మీకు ఆలోచన కలుగుతుందా, దర్శనం యివ్వండి. లేకపోతే దర్శనమే యివ్వవద్దు.

దర్శనం యిచ్చిన్నీ, మీకు కావలసిన వివరా లన్నీ తెలుసుకోడానికీ, అప్పుడున్నా సమ్మతి కలక్కపోతే తిరస్కరించడానికీ నా కేమీ ఆక్షేపణ లేదు.

రాజమండ్రి

ఇట్లు విధేయుడు

సుసర్ల కోటీశ్వరశాస్త్రి

ఉత్తరం పూర్తిచేసి, కృష్ణవేణి "వారిని మీా రెరుగుదురా నాన్నారూ?" అని అడిగింది.

"ఎరుగుదును. టెన్నిస్ ఆటలో మంచి నిపుణుడు. నిరు డీ వూళ్లో జరిగిన పోటీలో నెగ్గాడు. అతన్ని సత్కరించడానికి విద్యార్థులు చేసిన సభకి నేనే అధ్యక్షత వహించి, విద్యార్థుల కానుక నూరు రూపాయల టెన్నిస్ బాటూ నా చేత్తోటే యిచ్చాను"

"అమ్మ యేమంటుందో?"

"ఈ వుత్తరం ఆమె కూడా చూసింది. ఆస్తి బొత్తిగా తక్కువ అంటుంది మీా అమ్మ. అయినా పూచీ మన యిద్దరిమీాదా వుంచుతోంది"

కృష్ణవేణి మొగం వంచుకుంది.

ఒక్క క్షణం చూసి "అతను వస్తా నన్న వేళ కావచ్చింది. నీ వుద్దేశం యేమిటి తల్లీ?" అని అడిగాడతను.

"ఎల్. టీ. అంటే యెప్పటివారో వూహించారా?"

"అవును"

"అప్పణ్ణుంచీ స్థిర మైన వుద్యోగం సంపాదించలేక పోయా రన్నమాట"

"అన్నమాటే"

"పోనీ అని యేదీ వృత్తి కూడా ప్రారంభించలేదు"

"నామర్దా అని మానేసి వుంటాడు"

"రోజు కొక పార్టీ. పైగా కులాభిమానాలు. మునిసి పాలిటీ చివరి కేం చేస్తుందో చెప్పలేము"

"అదీ నిజమే"

కృష్ణవేణి వొక్క క్షణం ఆలోచించింది. శిరఃకంపం చేసి మళ్ళీ అందుకుంది.

"వారి రూపురేఖ లెరుగుదును. చురుకైనవారే. ప్రతిభావంతు లనే అనుకున్నాను. మీ కేమీ ఆక్షేపణ లేకపోతే దర్శనం యివ్వవచ్చు"

"వారు కోనసీమ స్వాములు. ఆలోచించావా?"

ఇలా అన్నప్పుడు అతని చూపుల్లో అపాయశంక స్ఫుటంగానే అంకితం అయింది.

"అయినా ముందు వారికి మన షరతులు నచ్చాలి కదా?"

"...................."

"దర్శనం యివ్వండి"

"ప్రస్తుతం అమల్లో వున్న లాలో యెక్కడా లేని పాయం కెత్తుతారు వారు"

"జడ్జీ అనాథ అయితేనూ? అంతేనా నాన్నారూ?"

ఇలా అంటూ ఆమె గంభీరంగా చూసింది.

యాజులు చిరునవ్వు నవ్వాడు.

"నా అభిప్రాయం అమ్మకి చెప్పి ఆమె యిష్టపడితేనే దర్శనం యివ్వండి నాన్నారూ"

"అలాగే నమ్మా" అని యాజులు హాల్లోకి వెళ్లి పోయాడు.

కృష్ణవేణి, ప్రూఫుల పని ముగించి మేజామీద గాజుబరిణలో వున్న యేలకిపం డొకటి వొలిచి నోట వేసుకుంది.

సరిగా యీ సమయంలో "ఆస్తి బొత్తిగా తక్కు వమ్మా" అంటూ రాధమ్మ వచ్చి, కూతురు తల నిము రుతూ కుర్చీ వెనకాల నుంచుంది. "బుద్ధి వుంటే ఆకాస్తా లేకపోయినా బాధ లేదమ్మా" అంటూ లేచి కృష్ణవేణి తల్లి కెదురుగా నుంచుంది.

"ఇల్లు పట్టిన వెధవాడబడుచు—"

"అదే ఆలోచిస్తున్నాను"

"గండ్ర అయితే కష్టం కాదూ"

"చదువుకున్నవారు కదా, యెవరిని వుంచవలసిన స్థితిలో వారి నుంచకుండా వారు కష్టాలు తెచ్చిపెట్టు కుంటారాఅని చూస్తున్నాను. నాన్నగారి ఔదార్యమూ

నా బాధ్యతా గుర్తించుకోకుండా ఆవిడ మాత్రం. మూర్ఖత్వం కనపరుస్తారా అని కూడా ఆలోచిస్తున్నాను"

"అంత ఆలోచన వున్న ఆడబడు చయితే యిక లోటే మిటి తల్లీ ?"

"చాలా రోజులనుంచి వా రుపాధ్యాయవృత్తిలో వున్నారు. అందుకోసం యీ సమ్మంధం అంటే నా కాశ వుడుతోంది. ఇంతకీ, సంసారం అన్న తరవాత కొన్ని కష్టాలు తప్పవు. ప్రాతిపదికలకు భంగం రానంత కాలం యెవ రయినా కష్టాలు వోర్చుకోవలసిందే"

"................."

"అత్తగారు బతికి వుండడమూ, వొక ఆడబడుచు యింటో వుండడమూ, నిజంగా కొత్తకోడలికి చాలా మంచిది"

"కాదుటమ్మా ?"

"కనక నా కేమీా భీతావహంగా లేదమ్మా"

"పోనీ తల్లీ నాకు కావలసిం దంతే. నువ్వు సుఖంగా వుండి, వారంతా ఆనందపడి— నా క దే కావాలి"

ఇలా అంటూ రాధమ్మ కూతుర్ని తన చేతుల్లోకి తీసుకుంది.

౫

హాల్లో గంట గణగణ లాడింది.

"వచ్చారు" అంటూ తల్లీ కూతురూ బయలు దేరారు.

కోటీశ్వరశాస్త్రి లేచి నుంచుని, వోరకంటమాటు కృష్ణవేణి కేసి చూసి, రాధమ్మకి నమస్కారం చేశాడు.

రాధమ్మ దాన్ని కళ్ళతో అందుకుని చిరునవ్వుతో అతనికి దీవన అందించింది.

కృష్ణవేణి కళ్ళల్లో, శాస్త్రికి, స్వాగతఫలకం చాలా వుజ్వలంగా కనపడ్డది.

అందరూ మేజా చుట్టూ కూచున్నారు.

యాజు లందుకున్నాడు.

"కట్నం విషయం మీరు బాగా ఆలోచించు కున్నారా?"

"చిత్తం, తమ రందరూ అది ప్రిన్సిపలుగా స్థిరపరచు కున్నట్టు నేను స్పష్టంగా తెలుసుకున్నాను. అది యిష్టమే"

"నాకు కృష్ణవేణి వొక్కర్తే సంతానం. నా ఆస్తి కంతకీ ఆమే వుత్తరవారసు. నేను దత్తత చేసుకోదలచు లేదు"

"చిత్రం"

"నాది రెండులక్షల రూపాయల ఆస్తి. బతికి వున్నంత కాలమూ నాకు పెద్ద పెన్షను వస్తుంది; కాని యిందులో మీా కేదీ స్వాధీనపడదు"

"ఇష్టపడ్డాను"

"మీా కిప్పటి కింకా స్థిర మైన వుద్యోగం లేదు. ఉద్యోగం కోసం మీారు మరోచోటికి వెళ్ళవలసిన అవ సరం కలగవచ్చు. అయితే మా అమ్మాయి మమ్మల్ని విడిచీ, యీావూరు విడిచీ యెక్కడికీ రాదు."

"అది కొంచెం కఠిన మైన షరతే. నేనే సద్దుకునే వుపాయాలు లేకపోలేదు. అయినా బాగా ఆలోచించి చెబుతాను"

యాజులు కృష్ణవేణి కేసి చూడగా ఆమె అందుకుంది.

"నే నొక పాఠశాల నడుపుతున్నాను. స్త్రీలలో కొత్త దృక్పథం ప్రవేశపెట్టాలనీ, స్త్రీల జీవితానికి విలువ కలిగించా లనీ నా సంకల్పం. నా జీవితం దానికోసం ధారపొయ్యాలని నాకు వ్రతం"

"సంతోషం"

"ఒకటి, నా భర్త. రెండు, నా తల్లిదండ్రులు.

మూడు, నా పాఠశాల. నా ప్రేమా, శ్రద్ధా ఈమూడువస్తువులమీదా యథార్థంగా వినియోగపరుచుకుంటాను"

"బోధపడింది. చాలా సంతోషం"

"భార్య అంటే బానిస కాదు, సమాన భాగస్వామిని. నా హక్కులు నేను పూర్తిగా అమలుపరుచుకుంటాను"

"తెలిసింది. అంగీకరించాను"

"భర్త వెంపువారిని నేను భక్తితో పూజిస్తాను. అయితే, వారు నన్ను ప్రేమిస్తేనే యిది జరుగుతుంది"

"సరే"

"అవసరం అయిం దని నాకు తోచినప్పుడు గృహిణి చెలాయించుకోవలసిన అధికారా లన్నీ నేను దఖలు పరుచుకుంటాను"

"అలాగే చెయ్యవచ్చు"

"సభలకి వెళ్ళడమూ, పురుషులతో కలిసే కూచోడమూ నా కలవాటు. ముందున్నూ అది అలా జరుగుతూనే వుంటుంది."

"నా కేమీ ఆక్షేపణ లేదు."

"నే నొంటరిగా పొరుగూళ్ళు వెళ్ళడం కూడా వుంది. ముందుముందు కూడా అలా వెడుతూనే వుంటాను"

"వెళ్లవచ్చు"

కృష్ణవేణి తల్లికేసి చూసింది.

వెంటనే రాధమ్మ "మీ అమ్మా, మీ అక్కా రజస్వల అయిన పిల్ల చేతి అన్నం తింటారా?" అని అడిగింది. వులిక్కి పడి, యాజులు "అవునవును. అది తప్పకుండా తేలవలసిన విషయమే" అన్నాడు.

శాస్త్రికి నవ్వు వచ్చింది. కాని దాన్ని లోపల్లోపలే అణుచుకుని, అతను "రెండుపూట్లా వారే వంటచేస్తారు. లేకపోతే వారుండి యేమి ప్రయోజనమూ? కనక, మీ అమ్మాయిగారు పోయి దగ్గిరికి వెళ్లవలసిన అవసరమే కలగదు. అయినా అంత అవసరం వస్తే అప్పుడు నిస్సందేహంగా భోజనం చేస్తారు" అన్నాడు.

అందరూ వొక్క క్షణం వూరుకున్నారు.

తరవాత, శాస్త్రి "మే మనుకోని కొత్త సంగతులు కొన్ని వచ్చాయి. అవేవీ వారికి సంబంధించినవి కావు. అయినా వారితో చెబుతాను. వారి యిష్టానిష్టాలతో సంబంధం లేకుండా నే నిప్పుడే అంగీకరించి వున్నాను. వారున్నూ అంగీకరిస్తా రనే నా నమ్మకం" అనగా కృష్ణవేణీ రాధమ్మా యాజులుకేసి చూశారు.

"మీరు బాగా ఆలోచించుకుని కభురుచెయ్యండి" అని అతను సంభాషణ పూర్తి చేశాడు.

అందరూ లేచారు.

"మా అమ్మా, మా అక్కా సాయంత్రం అయిదు గంటల కిక్కడికి వస్తారు. మూడు వంతులు వారు సమ్మంధం స్థిరపరచడానికే వస్తారు. నేను మాత్రం మన స్ఫూర్తిగా అంగీకరించాను" అని చెబుతూ మళ్ళీ నమస్కారం చేసి, శాస్త్రి, సెలవు పుచ్చుకు బయలుదేరి వెళ్ళిపోయాడు.

౬

సరిగా అయిదు గంటల వేళ ఒంటెద్దుబండి వచ్చి ద్వారమండపంలో ఆగింది. ఎదురు చూస్తూనే వున్న రాధమ్మ బండి దగ్గిరికి వెళ్ళి ప్రత్యుత్థానం చేసింది. అందుకు చాలా ఆశ్చర్యపడుతూ, చాలా సంతోషం కూడా పొందుతూ శాస్త్రి తల్లి మహాలక్ష్మమ్మా అక్క రాజమ్మా నవ్వుమొగాలతో బండి దిగారు. వంటలక్క సుభద్రమ్మ కాళ్ళు కడుక్కోడానికి నీళ్లు అందించింది.

రాధమ్మ వారికి చాలా మర్యాద చేసింది. మేడ అంతా చూపించింది. ఇదంతా అయినాక తివాసీమీద

కూచో బెట్టి, కూతుర్ని రప్పించి చూపించి, చివరికి మేజా దగ్గిరికి వెళ్లి కాలింగు బెల్లు నొక్కింది.

యాజులు వచ్చాడు.

స్త్రీ లంతా లేచారు.

మళ్లీ స్త్రీపురుషు లంతా కూచున్నారు.

యాజులు రిష్టువాచీ చూసుకున్నాడు. అది చూసి రాజమ్మ తల్లి తొడ గిల్లింది.

“అన్నయ్యగారూ” అంటూ అందుకుంది మహా లక్ష్మమ్మ.

“మా అబ్బాయి యిక్కడి సంగతులన్నీ చెప్పాడు. మా అబ్బాయీ మేమూ కూడా మీరు చెప్పినవాటి కన్నిటికీ వొప్పుకున్నాము. మా కేలాంటి ఆక్షేపణా లేదు. మా స్థితిగతులు మా అబ్బాయి చెప్పే వున్నాడు. మీ కంగీకారం అయితే ముహూర్తం స్థిరపరిపించవచ్చు”

ఇది విని, యాజులూ, రాధమ్మా, కృష్ణవేణీ వొకరి కేసి వొకరు చూసుకున్నారు. వారి మొగాలు వింత అందం వహించాయి. దాంతో హాలంతా తళుకుక్కుమంది.

“రేపు వుదయం పురోహితులవారిని మీ యింటికి పంపుతాను. ఆ విషయం అంతా వారు చూస్తా”రంటూ యాజులు వారి సెలవు పొంది వెళ్ళిపోయాడు.

"అత్తయ్యగారూ! మీ అమ్మాయి చేతి అన్నం తినడం మాట తెచ్చారుట మీరు. మే మిద్దరం వుండగా మీ అమ్మాయి వంటచెయ్యవలసిన అవసరం యేమిటండీ? కాకపోయినా, ఆమెని మా తమ్ముడికి చేసుకుంటే వొకటీ, ఆమె చేతి అన్నం తింటే వొకటీనా? ఇంతకీ పెళ్ళి అయాక, మేము మీ యింటికి వచ్చి మీరు వడ్డిస్తే భోజనం చెయ్యమూ? కనక, ఆశంక మాకూ లేదు. ఈసందేహం మీకూ వద్దు" అంటూ కళ్ళు తిప్పుకుంది రాజమ్మ.

దానిమీద వియ్యపురాళ్ళిద్దరూ "ఎప్పటి కెలాగో అలా సద్దుకోకపోతే యెలాగండీ?" అంటూ వొకరూ, "కాదూటండీ?" అంటూ వొకరూ బుగ్గలు నొక్కుకున్నారు.

*　　*　　*　　*

డిసెంబరు మూడో తేదీని కృష్ణవేణికీ, కోటీశ్వర శాస్త్రికీ వివాహం అయింది.

తం తంతా రెండు గంటలలో పూర్తి అయిపోయింది.

రాధమ్మ యాజులుగార్లు తమ జీవితకాలంలో తాము చెయ్యవలసిన శుభకార్యం యిదొక్కటే అయినా చాలా నిరాడంబరంగా చేశారు.

ఆవేళ, మధ్యాహ్నం మూడు గంటలవేళ, యాజులు, తనకి పరిచితు లయిన వ్వూరి పెద్దల కందరికీ టీపార్టీ యిచ్చాడు.

సాయంత్రం అయిదు గంటల వేళ, రాధమ్మ తనకీ కృష్ణవేణికీ పరిచితురాళ్లయిన స్త్రీల కందరికీ టీపార్టీ చేసి, పసుప్పూ, కుంకుమా, పట్టు రైకల గుడ్డలూ యిచ్చి సత్కరించింది.

పాఠశాలలో వున్న వుపాధ్యాయురాళ్లకీ, విద్యార్థినులకూ మాత్రం వరసగా మూడు రోజులు రెండు పూటలూ పిండివంటలతో భోజనాలు పెట్టారు.

అంతే.

అయిదో తేదీని పునస్సంధానం. అయిదు, ఆరు, ఏడు లేదు, ఎనిమిదో తేదీ సాయంత్రం కృష్ణవేణిని అత్త వారి యింటికి పంపారు.

## ౭

"తమ్ముడూ"

అతనికి మెళుకువ రాలేదు.

"ఒరేయ్"

పలకలేదు.

"శాస్త్రీ"

ఎవరోన్నా!

గట్టిగా పిలిస్తే మరదలి కెక్కడ వినపడిపోతుందో అని ఆమె కంఠం నొక్కుకుని మళ్ళీ పిలుస్తూ, కదిపింది. అతనికి కొంచెం మెళుకువ వచ్చింది; కాని గోడవేపుకి తిరిగి మళ్ళీ నిద్ర ఆరంభించాడు.

ఆమె మళ్ళీ కదుపుతూ, చెవిలో నోరు పెట్టి "వొరేయ్! అబ్బాయీ" అని పిలిచింది.

"అబ్బా! ......... ఎందుకే?" అంటూ! ముసముసలాడాడు. అతని కళ్ళు చింత నిప్పుల్లా వున్నాయి; కాని ఆమసకచీకట్లో అది ఆమెకి తెలవలేదు.

"ఏడు గంట లయిపోయిందిరా అప్పుడేనూ"

"అయితే యేమంటావ్?"

"నీ పెళ్లాం లేవడమే కాకుండా మొగం కడుక్కుని స్నానం చేసి—"

"అయితే?"

"కాఫీకి నీళ్ళు కూడా కాస్తోంది రా"

"పాలూ, పంచదారా, డికాక్షనూ కలిపాటప్పటికి నేను సిద్ధం కాలే నంటావా యేమిటి?"

"బాగానే వుంది. అది స్నానం కూడాచేసి చక్కగా ముస్తీబై కాఫీ తాగితే నువ్వు పాచి మొగంతో—"

"అబ్బ! నువ్వు చంపుతావే"

"ఇలా అయితే నువ్వు లోకువ అయిపోవు ట్రా?"

"సింగినాదం కాదూ?"

విసుక్కుంటూ అత నిలా అన్నాడు; కాని ధైర్యం చాలక లేచి కూచున్నాడు. కళ్ళు మాత్రం తెరవలేదు.

"లే లే. తొరగా మొగం కడుక్కో. అది చన్నీళ్ళే పోసుకుంది; కాని నీకు వేన్నీళ్ళు కాచాను"

"తొరుపు"

"అదెంత సేపు రా?"

"నువ్వు చన్నీళ్ళు తోడా టప్పటికి నేను మొగం కడుక్కో లేనంటావా యేమిటి?"

"మరి మంచం దిగు"

"నువ్వు ముందు పదవే"

అతను లేచి బట్ట సవరించుకుంటూ డేమో అని రాజమ్మ మొగం వంచుకు బయలుదేరింది. కాని గుమ్మం దాకా వచ్చి యిట్టే వెనక్కి తిరిగి చూడగా, అతను, మంచం దిగకపోవడమే కాదు, పైగా మళ్ళీ వొరుగుతున్నాడు.

అది చూసి, రాజమ్మ, వొళ్ళు మండగా, వొక్క అంగలో మళ్లీ దగ్గిరికి వెళ్ళి, సగం వొంగిన వాణ్ణిఆ సగం లోనే పట్టుకుని "వొరేయ్! నీ కేమేనా బుద్ధి వుందా లేదా? ఇందాకణ్ణుంచి చిలక్కి చెప్పినట్టు చెబుతూ వుంటే అంతా అరణ్యరోదనమేనా!" అంటూ కొంచెం గదిమింది.

"ఇంత పెందలాడే లేస్తే తరవాత నాకు తలనొప్పి వస్తుందే? రోజంతా మత్తుగా కూడా వుంటుంది వెధవది"

"ఏ మయినా సరే యెనిమిది దాటే దాకా పడు కుంటే యిక సాగదు. ఆడదానికి లోకువ అయిపోయా డంటే మొగాడిక గుడ్డిగవ్వకి మారడు"

కళ్లు మూసుకునే వుండి, వొక్క జోగు జోగి, అంతలో వులిక్కిపడి, కళ్ళు తెరుచుకుని "హు...... అయితే పద"అంటూ అతను మంచం దిగాడు.

ఇక ఫరవా లే దనుకుని రాజమ్మ గబగబా వెళ్లి పోయింది.

వెడుతూ వెడుతూ ఆమె వంటింటి వసారా కేసి వోరకంటితో చూడగా కృష్ణవేణి, ఫిల్టర్లో వుడుకునీళ్లు పోసి పాలగిన్నె అప్పుడే కుంపటిమీద వెడుతోంది.

దీంతో మరీ కంగారెత్తగా రాజమ్మ వొక్క దూకున నూతిదొడ్లో అడుగు పెడుతూ వెనక్కి తిరిగి చూసింది

గూట్లో వున్న గానుగుపుల్లతీసి నోట పెట్టుకుని, శాస్త్రి కొంచెం తూలుతూ వస్తున్నాడు.

## ౬

శాస్త్రి పొడిబట్ట కట్టుకునేటప్పటికి తాను తెచ్చిన తల నూనె చేతులుకి రాసుకుని సిద్ధంగా వున్న కృష్ణవేణి అతనికి నిమిషంలో తలదువ్వేసింది. అతను పట్టు తొడుక్కునేటప్పటికి తుంగచాప పరిచి తానొక చివర కూచుని కాఫీ కలిపింది. అతను కూడా కూచునేటప్పటికి కప్పులో పోసి కాఫీ చేతి కందించింది.

వీధిలో మోటూరు హారన్

శాస్త్రి వులిక్కిపడి చూశాడు.

“నాకోసం వచ్చింది కారు” అంది కృష్ణవేణి.

మొదట అతనికి అర్థం కాలేదు. కాని వొక్కన్వాను కాఫీ చప్పరించాటప్పటికి పాఠశాల సంగతి జ్ఞాపకం వచ్చి “వూఁహూఁ” అంటూ తల వూపాడు.

"కాఫీ బాగుందా?"

విలాసంగా చూస్తూ కృష్ణవేణి యిలా అడిగింది.

"చాలా బాగుంది. ఒకమాటు మద్రాసులో పుచ్చుకున్నా నిలాంటి కాఫీ. నాటికి నేడు మళ్లీ దొరికింది"

"చాలా సంతోషం..............రోజూ యిలా చెయ్యవచ్చు నన్నమాట"

".........ఇంకా అడగాలా? నా యింటోనే నాకిలాంటి కాఫీ దొరుకుతుం దనీ,— రోజూ దొరుకుతుం దనీ నే నెప్పు డేనా అనుకున్నానా? కాని నీకు శ్రమ—"

"శ్రమ కా దిది పరిశ్రమ ............ మీ రుచి కనుగుణంగా తయారు చెయ్యగలనో చెయ్యలేనో అని చాలా భయపడ్డాను......... నిజంగా బాగుందా?"

ఆమె గునుస్తూ అడిగింది. ఈషదుచ్ఛలితా లైన ఆమె నీమకమలాల లోలకులు అతని మనస్సుని వూచేశాయి.

"ముఖప్రీతిగా చెప్పిన మాట కా దిది. అన్నమూ, కూరలూ బాగుండకపోయినా సర్దుకోవచ్చు; గాని కాఫీ సరిగా కుదరకపోతే మతి పోతుంది ............ నేను నిజమే చెప్పాను......... కాఫీ,..... చాలా చాలా బాగుంది"

కృష్ణవేణి మొగమ్మీద ఉత్సాహం లాస్యం చేసింది.

మళ్ళీ వీధిలో మోటారు హారన్.

"అక్కా" అని పిలిచాడు శాస్త్రి గుమ్మంకేసి చూస్తూ.

అప్పటికి రాజమ్మ గుమ్మం పక్కనే పొంచివుండి వింటోంది. అయితే, పిలుపు వినపడే టప్పటికి పిల్లిలా వంటింటిదాకా మునగాళ్ళమీద పరిగెత్తుకు వెళ్ళి, అక్కడ గభీమని వెనక్కి తిరిగి, యేదో పని చేస్తూ లోపల వుండగా పిలుపు వినపడ్డదానిలాగ "పిలిచావా తమ్ముడూ!" అని మారు పిలిచింది.

కృష్ణవేణి "యెందుకూ?" అన్నట్టు చూస్తూనే వుంది; కాని అత నది గమనించకుండా "కాఫీ పుచ్చుకుంటున్నా రని డ్రైవరుతో చెప్పిరా" అన్నాడు.

"అక్కర్లే దండీ వదినా. మీరు వెళ్ళనక్కర్లేదు. తాను వచ్చి నట్టు నాకు తెలవడానికి రెండుమాట్లు హారన్ వేస్తుంది డ్రైవరు. అంతే" అని కూచునే వుండి కృష్ణవేణి చెప్పింది.

రాజమ్మ అప్పటి కప్పుడే వారి యెదటికి వచ్చింది; కాని మరదలి మాట విని వెనక్కి చక్కాపోయింది.

తాను ఆలస్యంగా లేచినందుకే కృష్ణవేణి కొంచెం యిదవుతూ వుంటుం దనుకుని, శాస్త్రి కొంచెం తొందరగా కాఫీ పుచ్చుకోసాగాడు. అది చూసి, కృష్ణవేణి "మీరు తొందరపడుతున్నారు. అలాంటి దేమీ అక్కర్లేదు" అని చెబుతూ అతని కప్పులో మళ్లీ కాఫీ పోసింది.

ఆమె కూడా మళ్లీ పోసుకుంటుందో పోసుకోదో అని చూసి, సందేహం తీరగా, అతను మళ్లీ కాఫీ పుచ్చుకోసాగాడు.

"మధ్యాహ్నం మీకు కాఫీ మాట యేమిటీ?"

"కాఫీహోటల్లో పుచ్చుకుంటాను"

"ఇంటికి రావడానికి వీలుండదూ?"

సైకిలుండినా రానూ పోనూ రెండు మైళ్ల పైచిలుకు. వచ్చినా సావకాశంగా కూచుని పుచ్చుకోడానికి వీలుండదు. వుడుకూ మడుకూ గొంతుకులో పోసుకుని, మళ్లీ వురుకులూ పరుగులూ—ఏమి సుఖమూ?"

"పోనీ సైకిలుమీద పాఠశాల నౌకరుచేత ఫ్లాస్కుతో పంపనా?"

"అది కూడా సైకిలు తొక్కగలదా?"

"తరుచు నా కారు అదే నడుపుతూ వుంటుంది"

"శెభాష్!......కాని ముందుముందు చూసుకుందాం, ప్రస్తుతం వద్దు"

ఇలా అంటూ అతను కప్పు కింద పెట్టాడు.

"సరిపోయిందా?" అని అడుగుతూ ఆమెకూడా కప్పు కింద వుంచింది.

"ఎక్కువే అయింది" అన్నా డతను, చెయ్యీ మూతీ తుడుచుకోడానికి జేబురుమాలుతీసుకోబోతూనూ.

అది కనిపెట్టి, ఆమె "నీళ్ళివిగో" అంటూ అతని చేతిలో కసిన్ని పోసి, తానుకూడా చెయ్యి కడుక్కుంది.

అతను లేచి మేజా దగ్గర నుంచుని సొరుగు లాగాడు.

కృష్ణవేణి, నిమిషంలో కప్పులూ సాసర్లూ స్పూను లూ కడిగి తెచ్చి, బీరువాలో వుంచి వచ్చి, అతని దగ్గరగా నుంచుని "పాఠశాలకి వెళ్ళవచ్చునా?" అని అడిగింది.

అప్పటి కప్పుడే వొక యేలకి పండు వొలిచి నోట వుంచుకుని వున్న అతను, మరో పండు వొలిచి "సందేహం యెందుకూ?" అని అడుగుతూ ఆమె నోటి కందించాడు.

అప్పు డామె రెండు చేతులతోనూ అతని కంఠం పెనవేసి "ఒక్క నిమిష మేనా వేళ తప్పడం నా నియమానికి ప్రతికూలంగా వుంటుంది. దయచేసి......రేప

ణ్ణుంచి ...... మీరు........."అని సుతారంగా తల ఆడిస్తూ కోకిలకూజితం మందరంలో లీనం చేసింది.

దానికి, అతని మనస్సు మొదట గుబగుబ లాడి పోయింది; కాని అంతలో దిటవు తెచ్చుకుని, అతను, రెండు చేతులతోనూ ఆమెని పొదివి పట్టుకుని, ఆర్డరు కాకితం మీద ఆఫీసు మొహరు వేసినట్టు ఆమె పెద వులమీద వొక కమ్మని ముద్దుంచాడు.

తరవాత గుమ్మందాకా బాహుబంధాల్లోనే వచ్చి, గుమ్మం దాటాటప్పుడు వొకరి కొకరు తగులుతూనే వుండి, క్రమంగా విడిపోయి వీధిలోకి వచ్చారు.

మొగుడు మద్రాసులో బి. యే. చదువుతూ వుండ డంవల్ల పుట్టింట వున్న యెదటింటివారి ఆడబడుచు, ఎడపిల్లను చంకను వేసుకుని కారు వచ్చినప్పణ్ణుంచీ వీధి గుమ్మంలోనే నుంచుని వుండి, వారిని చూడడంతోనే గిరుక్కున మళ్లీ తలుపు చాటున నక్కి తొంగిచూడ సాగింది.

కృష్ణవేణిని చూడడంతోనే డ్రైవరు, కారు దిగి, తలుపు తీసి, ఆమె యెక్కి కూచున్న తరవాత మళ్లీ తలుపు వేసి, వెంటనే వెళ్ళి తన స్థానంలో కూచుని, స్టార్టుచేసి హారన్ వేసింది.

కృష్ణవేణి భ్రూవిలాసంతో మొగుడి సెలవు పుచ్చుకుంది.

భోంయి మంటూ కారు వెళ్ళిపోయింది.

## ౬

ఆవేళ మధ్యాహ్నం రాధమ్మా, యాజులూ, కృష్ణవేణీ యేకబంతిని భోజనాలకు కూచున్నారు. వంటలక్క వడ్డిస్తోంది.

"నిన్న రాత్రి అన్నం నోటికి పోలే దమ్మా" అన్నాడు యాజులు.

"అనుకుంటూనే వున్నాను నాన్నారూ! మా ఆడబడుచు రాత్రి వారికీ, నాకూ యేకబంతిని వడ్డించారు. అయినా నాకు కూడా అమ్మా మీరూ లేకుండా భోజనం చెయ్యడం యెలాగో అనిపించింది. రెండుమాట్లు కొలకమారింది కూడానూ"

"చూశారా?" అంది రాధమ్మ. రాత్రి భోజనం దగ్గిర యాజులుకి రెండు మూడు మాట్లు కొలకమారింది.

అప్పుడు రాధమ్మ "అమ్మాయి తలుచుకుంటోందండీ" అంది. అది రుజువుచేసిందిప్పుడు.

"భోజనం చేసినంతసేపూ మీ మాటే అనుకున్నాను. ఎంత సద్దుకున్నా "నీ మూలాన మీ అమ్మా మీ నాన్నా యీ పూట—యీపూటే అన్నమా టేమిటి, యిక తరుచు సగం సగమే భోంచేసి లేచిపో తారు తెలుసా!" అని యెవరో గుచ్చిగుచ్చి అన్నట్టే వుం దండీ"

"నా కేమమ్మా? నేను కడుపునిండానే భోజనం చేశాను. మీ అమ్మ మీగడపెరుగు మానేసి చేసిన మజ్జిగ పోయించుకుంది. సుభద్రమ్మ ముందే నాకు పాలు పోసేసింది, లేకపోతే మీ అమ్మ పెరుగు మానేసినందుకు నేను కూడా పాలు మానేస్తును"

"అవునటే అమ్మా?"

చురుగ్గా చూస్తూ కృష్ణవేణి యిలా అడిగింది.

"అబ్బే, లేదమ్మా! రాత్రి కొంచెం అజీర్తిగా వుండి పెరుగు మానేశా నంతే. మీ నాన్న మరీనూ. మాట మీద మాట యిట్టే అల్లేస్తారు"

"వొట్టిదమ్మా! మీ అమ్మ చెప్పిం దంతా అబద్ధం. ఆమెకి అజీర్తి సుతరామూ లేదు. నాకు బాగా తెలుసు. నువ్వు బంతిని లేకపోవడం—పైగా నువ్వు నీయింటికి వెళ్లి

పోవడం—దీనివల్ల బెంగ తప్ప మీఅమ్మకి అజీర్తీ లేదు, మ రేమీ లేదు"

"అయితే, మీకు మాత్రం లేదా యేమిటి బెంగ?" అని చురచుర చూస్తూ అడిగింది రాధమ్మ.

"నాకూ వుంది. ఎక్కువగానే వుంది. కాని నాకూ నీకూ భేదం వుంది. నీది తల్లి ప్రాణం"

ఈ మాటతో రాధమ్మ మనస్సు కెలికేసిన ట్టయి పోయింది.

"సమ్మంధాలు రానంత సేపూ అయ్యో, యెలా గమ్మా? అనిపించేది. నిరుకైన సమ్మంధం తిరిగిపోతే ప్రాణంపోయిన ట్టయిపోయింది. ఆస్తి తక్కువయినా మళ్లీ యేదో సమ్మంధం వచ్చి స్థిరపడగా కొండ యెక్కి నట్టు కనపడింది. కార్యం నాలుగు రోజులూ వుబ లాటం వురకలు వేసింది. ఇలాగ దాన్ని మరో చోటికి పంపేసే ప్రయత్నాలే—యిష్టాపూర్తిగానే చేస్తూ వుండిన్నీ నిన్న సాయంత్రం దాని యింటి కది వెళ్ళాక—వొక అయ్య చేతిలో పెట్టాక—"

రాధమ్మ మరి మాట్లాడలేకపోయింది. కళ్ళల్లో బాష్పజలం గిర్రున తిరిగిపోయింది. పెదవులు రావి రేక ల్లాగ అల్లల్లాడిపోయాయి.

ఆమె స్థితి చూశాటప్పటికి యాజులు కళ్ళున్నూ చెమ్మగిల్లాయి.

ఆయిద్దర్నీ చూసి కృష్ణవేణి—

భోజనాలు మానేసి ముగ్గురూ పీటలకు చేరబడి పోయారు.

ఇదంతా చూస్తూ వున్న సుభద్రమ్మ తటాలున ముందుకి వచ్చి "ఆడపిల్లని కన్నవాళ్ళకిదే బాధండీ బాబుగారూ! నానాబాధలూ పడి పెంచి వొకరి యింటికి పంపెయ్యడం—కానయితే యిది యెవరికీ తప్పందే. మంగళకరం కాని యిది మరోటి కాదు కూడానూ; అయినా చేతులతో దేవేసినట్టయిపోతుంది మనస్సు. మా అమ్మాయి కాపరానికి వెళ్ళిన కొత్తలో నేనూ యిలాగే బాధపడ్డాను. తరవాత అలవాటయిపోయింది. అమ్మాయి ఆ రేళ్ళనుంచి చనువు కావడం వల్ల నిన్నరాత్రినుంచీ నాకున్నూ యెలాగో వుంది—కన్నకడుపు మీమాట యిక చెప్పే దేమిటీ! అవతలివారు వారిని నెత్తిమీద పెట్టుకున్నా మనకి కండలో కండ కోసేసినట్టు తలతిరిగిపోతుంది; కాని తప్పదు. తప్పించుకోనే లేము. ఆ ప్రయత్నం కూడా చెయ్యలేము. పైగా దానికోసం యెంత వుబలాటమూ? ఎంత సరం

జామూ—అమ్మాయీ! మీరు భోజనం చేస్తే గాని మీ అమ్మా మీనాన్నా మరి మెతుకు ముట్టరు. వారు తేమన్నంటారా పులుసా?'' అని అడిగింది.

దీంతో అందరూ ప్రకృతిలో పడ్డారు.

భోజనాలున్నూ సక్రమంగానే అయినాయి.

## ౧౦

కారు దిగి కృష్ణవేణీ, యెదటింటినుంచి వస్తూ రాజమ్మా వాకృమాటే గుమ్మం యెక్కారు.

"ఎక్కణ్ణుంచి వదినా?" అని అడిగింది కృష్ణవేణి.

"ఎదటింటివారి అబ్బాయికి పెళ్ళివారు వచ్చారు. చూద్దా మని వెళ్లగా యిప్పటిదాకా కూచోపెట్టారు'' అని కృష్ణవేణి దృష్టి నరికట్టే జవాబు చెప్పింది రాజమ్మ.

"పెళ్లికొడుకు వయ స్సెంతండీ?"

"పదహారో యేడు మొన్ననే వెళ్లింది ట"

"పెళ్లికూతురికి వుండవలసిన యీడేనా లేదుకదా అప్పుడే పెళ్ళేమిటండీ ఆపిల్లాడికీ?"

''ఊరికే సమ్మంధాలు వచ్చి పడిపోతూ వుంటే యేం చేస్తారూ మరీ? రెండు మాసాలలో యిది నాలుగో

సమ్మంధం. కాకపోయినా, వారు శాస్త్రం ప్రకారం నడు చుకుంటారు. పిల్లాడి తండ్రి వేదశాస్త్రాలు చదువుకున్న వారు; గాని వుద్యోగస్థులు కారు"

"అంత చిన్నతనంలో పెళ్లి చెయ్యడానికి శాస్త్రం వొప్పుకోదే? అయినా పెళ్ళికూతురి వయస్సెంత?"

"మొన్ననే తొమ్మిదో యేడు—"

"ఛీ! ఛీ! అవతలివారు మనుష్యులా రాక్షసులా వదినా? కన్నకూతురి గొంతుకు కోసెయ్యడానికి చేతు లెలా వస్తా యండీ వాళ్ళకి?"

రాజమ్మ మాట్టాడలేకపోయింది.

అప్పటి కప్పుడే వారు పడమటింటి దగ్గిరికి వచ్చారు. తుంగచాప పరుచుకుని ముసలమ్మ అక్కడ కూచుని వుంది. "రా అమ్మా" అని సాదరంగా కోడలి నాహ్వా నించి, కూచోడానికి చాప చూపించి, ఆవిడ "ఏమయిం" దని కూతురి నడిగింది.

ముగ్గురూ చాపమీద సద్దుకూచున్నారు.

"ఏ మయిం" దన్నట్టు ముసలమ్మ మళ్ళీ చూడగా రాజమ్మ అందుకుంది.

"కట్నంఆరు వేలకి దిమ్మిడీతగ్గమన్నారవధానులుగారు. ఆడపడుచుల కారుగురికీ ఆరువందలు, వియ్యపురాలికి

రెండు వందలు, తాపితాలూ, వెండిసామానూ— వీటి కోసం పెళ్ళికొడుక్కి మూడువందల పదహారు, మొత్తం లాంఛనాలు వెయ్యిన్నూట పదహా ర్లడిగారు"

"బాగానే అడిగారు. అవును, వారి కేం లోటూ అడక్క? పదివే లయినా అడగతగ్గవా ళ్ళే"

ఇలా అంటూ, ముసలమ్మ యీాదాలాభంగా కృష్ణ వేణి కేసి చూసింది. కొంచెం చిరునవ్వు నవ్వుతూ రాజమ్మ కూడా చూసింది.

ఆచూపుల్లో కృష్ణవేణికి వెటకారం కనపడింది.

పైగా "వరకట్నం అంటే వీరికి ప్రీతిగానే వుంది. తిరస్కారభావం లేదు. అయి తే, కట్నం వొద్దులుకుని నన్నెందుకు చేసుకున్నారూ?" అంటూ విచికిత్స కూడా కలిగింది. దానిమీాద "కొడుకు నమ్ముకోడాని కేశాస్త్రం అధికారం యిచ్చిందో అవధానులుగారికి!" అని కొంచెం చురుగ్గా అడిగింది.

"డబ్బు వచ్చేచోట శాస్త్రం పట్టుకూర్చుంటారా యేమిటి? ఆయన ఆరుగురు అల్లుళ్ళకీ ఆరువేలు కట్నం యిచ్చారు. అదంతా వొక్క కొడుక్కి రావా లని నిరుకుచేసుకున్నారు. వస్తుంది కూడాను. వారి కేం రాకా! ముప్ఫయి నలభై వేలు వడ్డీమీాద తిరుగుతూ వున్న

ప్పుడు వారికి రాక మరెవరికి వస్తుందీ? పైగా వొక్కగా నొక్క కొడుకు. ఆరుగురు కూతుళ్ళ వెనక గారాల కూచమ్మ"

"ఎందుకు వచ్చిన చదువు? ఎందుకు వచ్చిన యేళ్ళు? ఆరువేలు కట్నమా? అవతలివారు దీంతో యేట్లో కలిసిపోవలసిందేనా?"

"వారికేం? వారికీ యాభయివేల వడ్డీవ్యాపారంవుంది"

"అదే వృత్తా వారికి?"

"బెజవాడలో పెద్ద బరందుషాపు కూడా వుందిట"

"సెబాస్! చాలా బాగుంది వదినా! ఇక్కడ నర మాంసవిక్రయం చేసేవారూ, అక్కడ మద్యవిక్రయం చేసేవారూ వియ్యం అందడం చాలాచాలా బాగుంది. జపం చేసుకోడానికి అవధానులుగారి కిక పీపాలతోటే సప్లయి. బహుశా మొగపెళ్ళివారిలో ఆడాళ్ళకీ మొగాళ్ళకీ కూడా మనిషి వొక్కంటికి రోజు కొక సీసాచొప్పున దాహం యివ్వాలని కూడా అవధానులుగారు కోరే వుంటారు. ఛీ! ఎందుకు వచ్చిన బ్రాహ్మణ్యం వదినా! ఆపెళ్ళిమాట చెప్పుకుంటే మన నోళ్ళు కూడా చెడిపోతాయి వూరుకోండి"

నోరెత్తలేక రాజమ్మ వీధి గుమ్మం కేసి చూసింది. అదేమిటో అని కృష్ణవేణి అలా చూడగా, గుమ్మంలో నుంచే కోటుతీసేసుకుంటూ కోటీశ్వరశాస్త్రి వస్తున్నాడు.

కృష్ణవేణి వెంటనే లేచి యెదురు వెళ్ళి ఆకోటందుకుని అతనితో కూడా గదిలోకి వెళ్ళింది.

"కట్నం అనేటప్పటి కెంత కోపం వచ్చిందో చూశావా ?'' అని కళ్ళు తిప్పుకుంటూ సన్నని గొంతుకతో రాజమ్మ అనగా—

"పోనీవే, బి-యే. చదివినా అబ్బాయి కనపడాటప్పటికి లేచివెళ్ళి కోటందుకుంది. పాడు కట్నం పోనిస్తూ" అంది ముసలమ్మ.

"కట్నం విలవ నీ కేం తెలుసునూ ? ఎక్కడో జల్లసీమలో పుట్టి దారి తప్పి మా కోనసీమలో పడ్డావు"

"పోదూ నేర్చుకుపోయావ్ !"

"అలాగే పోతానోయ్! డబ్బంటే అంత చేదుగా వుందా నీకూ ? నూటపదహార్లయినా కట్నం లాగనందుకు అబ్బాయిని మాసీమవాళ్లెంత పీకేస్తున్నారో, వాడెంత సిగ్గుపడిపోతున్నాడో—"

"ఇష్టపడి చేసుకుని—"

"ఇష్టపడ్డాం - ఇష్టపడ్డాం, అయిష్టం యెలాంటిదో తెలుస్తుంది తొందరపడకు"

"ఏం చెయ్యదలచుకున్నా రేమిటే మీ రిద్దరూనూ"

"చూస్తూ వుండు నీకే—"

మాట సగంలో సబ్బూ తువ్వాలూ పట్టుకుని కృష్ణవేణి యివతలికి వచ్చింది. శాస్త్రి నూతికి వెళ్ళాడు. ఒక్క అడుగు అక్కడే నుంచుని కృష్ణవేణి వెనకాలే వెళ్ళింది.

నూతికేసి మళ్ళీదాకా, రాజమ్మ, రెప్పవెయ్యకుండా కృష్ణవేణికేసి చూస్తూ నుంచుంది.

మహాలక్ష్మమ్మ, రాజమ్మ అలా చూసినంతసేపూ రాజమ్మని విడిచి కృష్ణవేణినీ కృష్ణవేణిని విడిచి రాజమ్మనీ చూస్తూ కూచుంది.

తరవాత, రాజమ్మ, తల్లికేసి తాపీగా తిరిగింది.

కృష్ణవేణిని యేదో అంటూ వున్నట్టామె పెదవులు కొంచెం కదిలాయి. చూపుల్లో వోర్వలేని తనమున్నూ కనపడింది.

దానికి ప్రతిహతంగా మహాలక్ష్మమ్మ "మామ్మే! మాతల్లే! ఆలస్యం అయినా చివరికి నా కొడుక్కి రత్నం దొరికింది" అంటూ సంబరపడింది.

ఇది విని రాజమ్మ సహించలేకపోయింది.

వెంటనే ఆమె తల్లిమీాదకి బారలు చాపుతూ "ఆవిడ గారు రత్నామాణిక్యమే. సందేహం లేదు. అయితే ఆ రత్నం తాపడం చేసుకోడాని కివతల తగినంత బంగారం వుండొద్దూ?" అంటూ రుంజుకుంది.

## ౧౧

అప్పుడే భోజనం చేసి, కృష్ణవేణీ, రాధమ్మా, యాజులూ మేడహాల్లో కూచుని తాంబూలాలు వేసుకుంటున్నారు.

"ఏమే అమ్మాయీ, ఆ దొప్పెడు అద్దెకొంపలోనూ యింకెన్నాళ్ళిబ్బంది పడతావే? మనకి మూాడు మేడ లుండగా మీారు కూడా అలాగే వూరుకున్నా రేమి టండీ!" అంది రాధమ్మ.

"విన్నావా!" అన్నట్లు యాజులు తన కేసి చూడగా, కృష్ణవేణి మందహాసం చేసింది.

"అమ్మాయి చెయ్యమన్నది నే నెప్పుడయినా కాదన్నా నేమో అడుగూ" అన్నాడు యాజులు.

"అంటే?" అని చురుగ్గా చూసింది రాధమ్మ.

"బాగా జ్ఞాపకం చేసుకో. చదువు చాలించి అమ్మాయి యింటికి వచ్చిన రోజునే మన ఆస్తి అంతా దాని కిచ్చే

శాను నేను. "నీయిష్టం వచ్చినట్టు చేసుకో" అన్నాను. "నువ్వే యజమానురాల" వనీ "నేను ట్రస్టీని మాత్రమే" అనీ కూడా చెప్పాను. "ప్రస్తుతం నెలకి రెండు వందల యాభై యి"మ్మంది. ఇస్తున్నాను. అది మేడ సంగతి చెప్పలేదు. అంచేత నేనూ వూరుకున్నాను."

"నువ్వే మంటావే?"

"నాన్నారు జరిగింది జరిగినట్టు చెప్పారు. అందులో తేడా—"

"పోనీ, యిక ముందు సంగతి చెప్పు"

"అదే చెప్పబోతున్నాను. వారిదగ్గిర కొంచెం సోమరి తనం కనపడుతోంది. దర్జా కోసమే కాని ఆదర్జాకి తగిన పరిస్థితులు కలిగించుకోడానికి చూస్తూ వున్నట్టు లేదు. పైగా, మా ఆడబడుచు ధోరణి అదో మోస్తరుగా వుంది. "వారు స్వతంత్రులా, ఆవిడచేతిలోవారా?" అని నా కెప్పుడు గట్టి అనుమానం. అంచేత అదేదో తేలా లని చూస్తున్నాను. ఒక సంవత్సరం పూర్తి కానియ్యి, ఇంతలో మునిగిపోయీా దేమీా లేదు"

"పూర్తిగా పన్నెండు మాసాలే!"

ఇలా అంటూ సోఫాకి జేరబడిపోయింది రాధమ్మ.

“ఏమమ్మా! నాన్నారు గుమాస్తాగా వున్నప్పుడు నువ్వెన్నేళ్లు బాధపడ్డావో జ్ఞాపకం చేసుకో”

“అప్పుడు మేము లేక యిబ్బందిపడ్డాము. నీకేం తల్లీ యిప్పుడూ!”

“మాయిద్దరి మనస్సులూ యిలా కలిసి వున్నంత కాలమూ నాకూ యిబ్బంది కనపడదు. మావారూ నేనూ మేడలో వుండి సుఖపడా లని నాకు లేదనుకు న్నావా? కాని దేనికేనా వొక నియమం వుండాలి. నేను చేసిన పని విషమిస్తే నాన్నారు చాలా బాధపడతారు నే నది చూడలేను. భరించలేను. దానివల్ల నాకు జయమూ కలగదు”

ఇది విని యాజులు ఆనందపరవశు డయిపోయాడు.

“అలాంటి దేమీ తటస్థించకూడ దంటే మాయింటి సంగతులన్నీ నాకు స్పష్టంగా బోధపడాలి. అందుకోసమే నేను సంవత్సరం గడువు పెట్టుకున్నాను”

“మీ అత్తగారు—”

“ఆవిడ నాకు అత్తగారు కాదు, రెండో తల్లి”

యాజులూ రాధమ్మా సంబరపడుతూ చూసుకు న్నారు.

"మనుష్యుల యోగ్యత పరిశీలించడానికి కొక్క సంవత్సరం పెద్దదికాదు. ఈలోపున నాకు చిన్న యెత్తున నద్దుకోడం చేత నవుతుంది. అలవాటూ అవుతుంది"

"ఈలోపున వా రెన్ని గుంజాటలు పడతారో? ఎన్ని అపనమ్మకాలు పెంచుకుంటారో?ఎంత చిరాకుపడతారో"

"పడతారో అనుభవిస్తారో? ఒకరి సొత్తు వొకరికి సునాయాసంగా దఖలుపడా లంటే మాటలా? నాన్నా రెంత కష్టపడితే నువ్వింత ఐశ్వర్యవంతురాల వయినావో యెప్పు డేనా ఆలోచించుకున్నావా?"

కృష్ణవేణి యిలా అనేటప్పటికి ఆవృద్ధదంపతులకు తమ ప్రారంభజీవితం అంతా నెమరుకి వచ్చింది.

అందులో వొక ఘట్టం రాధమ్మకి ఠక్కున స్ఫురించింది.

౧౨

యాజులు నెల్లూరి జిల్లాకోర్టులో గుమాస్తాగా వుండినప్పటి సంగతి.

ఇక నెలా పదిహేను రోజు లుంచనగా, సంకురాత్రి పండుక్కి రాధమ్మని పుట్టింటివారు తీసుకువెళ్ళ రని తేలిపోయింది.

అప్పటి కామె పద్ధెనిమి దేళ్ళపిల్ల. పండుగు లనీ, పబ్బా, లనీ, అచ్చట్లనీ ముచ్చట్లనీ కిందా మీాదా పడి పోతూ వుండేవయస్సు.

దగ్గరగా వున్నంత కాలమూ పుట్టింటివా రామెకి లాంఛలా లన్నీ బాగానే తీర్చేవారు; కాని నెల్లూరికీ పిఠాపురానికీ రానూ పోనూ కూతురికీ అల్లుడికీ కావలసిన రైలుఖర్చుల మొత్తం తెలిశాటప్పటికి వారికి గుండె లాగిపోయాయి.

ఇది ఆలోచించి చివరికి రాధమ్మ కూడా సరిపెట్టు కుంది.

మొదట మాత్రం తండ్రి రాసిన వుత్తరం చూసు కుని ఆమె నిర్ఘాంత పడిపోయింది.

ఇది యాజులు గుర్తించాడు. అతని హృదయం దడ దడ కొట్టుకుంది; కాని వొక్క క్షణంలో తేరుకుని, ఆమె కళ్ళల్లోకి జాలిగా చూసి, తన వెచ్చని పెదవులతో తాకి ఆమె పెదవులకు చలనం కలిగించుకున్నాడు.

తరవాత "మడి కట్టుకోండి" అంటూ ఆమె వంటిం టోకి వెళ్లిపోయింది.

అతను తాపితా కట్టుకున్నాడు. కుచ్చెళ్ళు పోసుకునే టప్పుడు "రెండేళ్ళకిందట విజయదశమినాడు నీ అత్తవా

రిచ్చారు నీకిది. ఇంత గొప్పవి కాకపోయినా, ప్రతీ సంవత్సరమూ నువ్వు నీ అత్తవారి బహుమతులు కట్టుకుంటూనే వున్నావు; కాని, పుట్టింటివా రిస్తూనే వున్నారు గదా, లోటు లేదుగదా అనుకుంటున్నావే కాని రాధకి నువ్వొక్క చీర అయినా కొనిపెట్టావా పాపం? చిలకవంటి పిల్లానికి మొగుడు చూపించవలసిన మురిపం యిదేనా? చివరికి వొక్క రైక అయినా కుట్టించావా? నీ కిది బాగుం దనిపించిందా?" అని యెవరో నిలవతీసి అడిగిన ట్టనిపించింది.

దీంతో వల్లమాలిన సిగ్గువచ్చి వూదర గొట్టేసింది.

దానిమీద "ఇప్పుడేనా రాధ కొక మంచిచీర కొని యివ్వా" లనుకున్నాడు. "ఇచ్చి తీరాలి. పండుక్కొత్తచీర లేని లోటు కలగనివ్వకూడదు" అని దృఢపరుచుకున్నాడు.

కానీ, డబ్బేదీ?

ఏనెల జీతం ఆనెలకే చాలీ చాలన ట్టుంది. అక్కడికీ నెల్లూరిలో యింటి అద్దెలు చౌక కనక సరిపోయింది; కాని లేకపోతే యెన్ని చేబదుళ్లు చేస్తూ యెన్ని పాడి దుడుకులు పడవలసివచ్చేదో?

రాధమ్మ కూడా పొదుపయిన మనిషి కనక ఆట

సాగుతోంది; కాని కాకపోతే, ఆ చేబదుళ్ళకు సాయం యెన్ని అరువులు పెరిగిపోయి వుండునో?

ఏమయినా చీర కొనితీరా లని శపథం పట్టుకున్నాడు.

ఖర్చులు తగ్గించుకోడం తప్ప మార్గాంతరం కనపడ లేదు. ఆఖర్చులలో నేనా సంసారంకోసం రాధమ్మ చేసేవాటిలో తగ్గించడానికి వీలు కనపడలేదు.

దీనిమీాద "నాఖర్చులు తగ్గించుకుంటా" నని అతను నిశ్చయించుకున్నాడు.

అది మొదలు అతను నాటకాలకి వెళ్ళడం కట్టిపెట్టే శాడు. పుస్తకాలు కొనడం మానేసి భాండాగారానికి వెళ్ళసాగాడు. ఒకటి రెండు వినోదయాత్రలు చాలించు కున్నాడు. కోర్టుకి వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ బండె క్కడం తగ్గించుకున్నాడు. మధ్యాహ్నం కోర్టుదగ్గిర ఫల హారం వొక్కటే కాదు, కాఫీ కూడా మానుకున్నాడు.

పొద్దుటి పూట మాత్రం యింటిదగ్గిర కాఫీసేవ మానుకోలేదు. అంచేత రాధమ్మకిదేమిా తెలవకుండా జరిగిపోయింది.

## ౧౩

ఆ వేళ పెద్దపండుగు.

మధ్యాహ్నం రెండుగంటల సమయంలో, యాజులు, రాధమ్మ యేం చేస్తోందో చూదా మని వసారాలోకి వెళ్ళి జంట వెదురుకుర్చీలో కూచున్నాడు. ఉన్న చీరల్లో మంచివి నాలుగు పట్టుకు వచ్చి "పీటిలో యేది కట్టు కోను చెప్పండీ" అంటూ రాధమ్మ పక్కని కూచుంది.

"నన్నడగడం యెందుకూ?"

"మంచిచీర కట్టుకోడం మీకోసమా నాకోసమా?"

"నాకోసమే. అయితే, ఆచీరలన్నీ మీవా ళ్ళిచ్చి నవి. వాటిమీద నాకేమీ అధికారం లేదు"

"అదేమిటండీ?"

"ఎకసక్కెం చెయ్యడం లేదు నేను"

"చె——ప్పండీ పెడర్థాలు తియ్యకా"

ఇలా గునుస్తూ ఆమె కుడిచెయ్యి అతని నడుముకి చుట్టేసింది.

దానిమీద, ఆనందమూ, వుద్వేగమూ అతికష్టం మీద అణుచుకుంటూ అతను "నేను మానెయ్య మన్నది మానేసి కట్టుకో మన్నది కట్టుకుంటావా?" అని గంభీ రంగా ప్రశ్నించాడు.

"ఆ"

"అయితే అవన్నీ పెట్టెలో పెట్టేసి రా"

ఆమె కేమీ అర్థం కాలేదు. అయినా, యేదో లేకుండా అత నలా చెప్ప డని యెరుగును కనక, అతనికి అడ్డు కూడా చెప్పలేదు కనక, వొక్కమాటు గంభీరంగా చూసి అవి యింటో పెట్టేసి వచ్చి, మళ్ళీ పక్కని కూచుని "మరి చెప్పండి" అని అడిగింది.

వెంటనే అత నొక్కమాటు మందహాసం మొలిపించి, అతి తాపీగా లేచి, అతిదర్జాగా వాకిట్లోకి వెళ్ళి, మేజా సొరుగులో నుంచి వొక పొట్లం తీసుకు వచ్చి అతిప్రేమతో ఆమె కందించి దగ్గిరగా కూచున్నాడు.

ఆమె చేతులు గబగబ లాడిపోయాయి.

విప్పి చూడగా, అల్లనేరేడుపండు చాయలో నిగనిగ మెరిసి పోతూ పుల్లంపేట జరీచీర.

"ఇదెలా వచ్చిం దండీ!" అని అడుగుతూ ఆమె మడత విప్పింది. వెంటనే మైజారు కొంగున వున్న జరీ నిగనిగ, ఆమె కళ్ళల్లోనూ, చెక్కిళ్ళమీదా, పెదవుల మీదా తళుక్కు మంది.

దాంతో అతని మొగం మరీ గంభీరముద్ర వహించింది.

"చెప్పండీ"

"వెళ్ళికట్టుకు రా"

"మానేస్తానా యేమిటి చె—ప్పండీ"

"చెప్పనా యేమిటి కట్టుకురా"

ఆమె గదిలోకి వెళ్ళి మడత పూర్తిగా విప్పగా యేదో కింద పడింది.

"ఇందులో పట్టు జాకెట్టు కూడా వుందండీ"

"ఇంకేం, తొడుక్కురా"

రాజు లిక్కడ మాట్లాడకుండానే కూచున్నాడు కాని "మామిడిపిందె లించుక్కున్నాయో!" "బాబోయ్! పద్దెనిమిది మూళ్ళ పొడు గున్న ట్టుంది" "మా అమ్మ యిలాంటిది వొక్కటీ పెట్టలేకపోయింది" "ఎన్నాళ్ళ నుంచో మనసుపడుతున్నా నీరంగుకోసం. పాపం, చెప్పి నట్టు తెచ్చిపెట్టారు" అంటూ అక్కడ రాధమ్మ రిమా ర్కులమీద రిమార్కులు దొర్లించేసింది.

అది విని తన కష్టం పూర్తిగా ఫలించినందు కతను చాలా సంతోషించాడు.

తరవాత ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వచ్చి వొళ్ళో కూచుని ఆమె "యిదెలా వచ్చింది చెప్పరూ?" అని మళ్లీ అడిగింది.

"పుల్లంపేటలో వొక దేవాంగి నేశాడు"

"ఊహూ"

"అది తెప్పించి నాతా సుదర్శనశెట్టి నెల్లూరి పెద్ద బజారులో పెట్టి అమ్మాడు"

"సరే"

"నేను కొన్నాను"

"బాగుంది"

"నువ్వు కట్టుకున్నావు"

"ఎలా వచ్చిందీ?"

"మళ్లీ మొదలా?"

"మరి నా ప్రశ్న అలాగే వుండిపోయింది కదూ?"

"లేదు, బాగా ఆలోచించుకో"

"పోనీ, యిది చెప్పండి. డబ్బెక్కడిదీ?"

"మన యింటోదే"

"నాకు తెలవకుండా యెలా వచ్చిందీ?"

"మిగిలిస్తే వచ్చింది"

"ఎవరూ?"

"నేను"

"ఎలా మిగిల్చారూ?"

అతను రెప్ప వెయ్యకుండా చూశాడు.

"చెప్పరు కాదూ? అయితే నన్ను—"

"ఆగు ఆగు. ఇవాళ పే--ద్ధ పండుగు. అలాంటి మాటలు రాకూడదు"

"అయితే, మరి చెప్పండి"

యాజులు జరిగిందంతా చెప్పాడు; కాని, నమ్మలేక, ఆమె, "నిజంగా!" అంటూ చెయ్యి చాపింది.

"అక్షరాలా నిజం. ముమ్మాటికీ నిజం" అంటూ అత నాచేతిలో చెయ్యి వేసి, ఆచెయ్యి గిల్లాడు.

ఆమె మనస్సు గుబగుబ లాడిపోయింది. హృదయం నీరయిపోయింది. కళ్ళు చెమ్మగిల్లాయి.

"చూశారా? నా చీరకోసం కారెండలో నడిచి వెళ్ళారా? అక్కడ కడుపు మాడ్చుకుని వుసూరుమంటూ పని చేశారా? చీర లేకపోతే నాకు పండుగు వెళ్ళదనుకున్నారా? నేను రాకాసినా!" అని యిక మాట్లాడలేక చేతులు అతని కంఠానికి పెనవేసి తన శిరస్సు ఆతని భుజంమీద ఆనుకుని దుఃఖించసాగింది.

అది చూసి మొదట అతను నిర్విణ్ణు డయిపోయాడు; కాని తరవాత "ఛా! ఏడుస్తావా? నేను ఏది వద్దనుకున్నానో అదే చేస్తావా? ఇలా చూడూ. అబ్బే! అయితే నాకూ నీకూ మాట ల్లేవు. నాకూ నీకూ జత

లేదు" అని బెదిరిస్తూ మూతి బిడాయించుకుని ఆమె మొగం పైకెత్తి కొంటె చూపులు చూశాడు.

ఏడ్వల్లా ఆమెకి నవ్వాయిపోయింది.

"మరి నాతో యెందుకు చెప్పారు కాదూ? నేను మాత్రం కాఫీ మానుకోకపోదునా? దాంతో మీకూడా జామారు రాకపోవునా?"

"ఇప్పుడు రాకపోతేనా?"

"ఏదీ, చూపించరూ!"

ఇద్దరూ లేచారు. ఒకర్ని వొకరు పొదివి పట్టుకుని వాకిట్లో మేజా దగ్గిరికి వెళ్లారు. యాజులు సొరుగు లాగి వెంకటగిరి సరిగంచు చాపు పైకి తీశాడు.

అది చూసి, ఆమె సంతోషవిహ్వాల అయి "మరి తొరగా కట్టేసుకోండి" అంటూ అతని భుజాలు వూపేసింది.

ముప్ఫయి సంవత్సరాలనాటి యీ సంగతి, అప్పుడు, తన కళ్ళ యెదట జరిగినట్టు కనపడగా రాధమ్మ వొక్క క్షణం తాదాత్మ్యం పొందింది; కాని వెంటనే ఆమె ప్రకృతిలో పడి "ముసలివాళ్ళం మేము మేడలో కాపరమూ, మా అమ్మవు నువ్వు ఒక చిన్ని కొంపలో కాపరమూనా? నేను చూడలేనే. నామనస్సు చెదరిపోతేండే

తల్లీ!'' అని గోలపెడుతూ కృష్ణవేణి రెండుచేతులూ పట్టుకుంది.

ఆమాతృవాత్సల్యం చూసి కృష్ణవేణి పసిబిడ్డ అయిపోయి ఆమెమీదకి వాలింది. యాజులు దగ్గిరికి వచ్చి కూచుని రాధమ్మ కళ్లు తుడిచాడు.

కాని ఎంతచెప్పీ యేమి చేసీ కూడా రాధమ్మ కృష్ణవేణి నిర్ణయం పూర్వపక్షం చెయ్యలేకపోయింది. పై పెచ్చు చివరి కామె నిశ్చయం కొనసాగించడానికే అంగీకరించింది.

## ౧౪

వేసవి సెలవులు పూర్తి అయి ఆవేళే మునిసిపల్ హైస్కూలు తెరిచారు.

కృష్ణవేణీ, కోటీశ్వరశాస్త్రీ, రాధమ్మా, యాజులూ బెంగుళూరినుంచి సపరివారంగా మద్రాసు మెయిలు దిగారు.

ఆదరా బాదరా స్నానం చేసి, నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని, టెన్నిస్ బాటు హాండిల్ బారుకి తగిలించి శాస్త్రి దర్జాగా సైకి లెక్కాడు.

కాని స్కూలులో అడుగు పెట్టాటప్పటికి అతని నవ నాడులూ కుంగిపోయాయి.

ఎవరి స్థానంలో శాస్త్రి ఆక్టింగు చేస్తున్నాడో ఆపెద్ద మనిషి, తనకి సెలవు అవసరం లేదని చైర్మనుకి విన్నవిం చుకొని,వుత్తరువు పొంది,తన సీటులో కూచుని వున్నాడు.

పైగా, గొప్పపిల్లని పెళ్ళి చేసుకుని తనకి బహు మతీ యివ్వనందుకు గుర్రుగా వున్న స్కూలు నౌఖరు ఆస్థితిలో శాస్త్రిని చూసి విషపునవ్వు నవ్వాడు. విద్యా ర్థుల మొగాలమీద కూడా శాస్త్రికి వెటకారమే కన పడింది.

హెడ్మాస్టరు దగ్గిరికి వెళ్ళగా "నే నేం చెయ్యనూ?" అని యెదు రడిగాడు.

తోటి వుపాధ్యాయుడి దగ్గిరికి వెళ్ళగా "యేదో కుంభకోణం జరిగింది; కాని వివరాలు చెప్పలేను" అన్నాడు.

రైటరు దగ్గిరికి వెళ్ళగా "యేమి జరిగిందో చెప్పలేను. జరగడం మాత్రం నిసలు. అయితే, అది యీ స్కూలు ఆవరణలో మాత్రం జరగలేదు" అన్నాడు.

కమీషనరు దగ్గిరికి వెళ్ళగా "మీరు బెంగుళూరిలో వున్నారు, నే నిక్కడ వున్నాను. భేదం యిదీ; కాని

ఫలితం వొకటే. సంగతి మీకెంత తెలుసునో నాకూ అంతే తెలుసును. ఆసంబంధమైన కాగితాలు కావాలంటే మాత్రం చూపించగలను' అని చెబుతూ చాలా జాలి కనపరిచాడు.

శాస్త్రి కాగితాలు చూశాడు; గాని కిటుకు బోధ పడలేదు.

చివరికి "ఇక్కడ మీ రెంత తంటాలు పడ్డా లాభం లేదు. కార్యం కాకపోవడమే కాదు, కారణా లయినా తెలియవు" అని చెబుతూ ఆఫీసు మానేజరు సలహా చెప్పగా శాస్త్రి కాళ్లీడ్చుకుంటూ—పోనీ, సైకిలు గెంటుకుంటూ చెయిర్మను యింటికి వెళ్లాడు.

కాని దర్శనం కాలేదు.

"ఈవిషయంలో మాట్లాడవలసిం దేమీ లే" దని నిక్కచ్చిగా జవాబు వచ్చింది కూడానూ.

కళ్లనీళ్ల పర్యంతమూ అయి శాస్త్రి యింటికి వెళ్లాడు.

అసమయంలో యింటికి రావడం చూసి ఆశ్చర్యపడి రాజమ్మ అడగ్గా శాస్త్రి జరిగిందంతా చెప్పాడు.

మహాలక్ష్మమ్మ "అయ్యో" అంటూ కూలబడి పోయింది.

రాజమ్మ తమ్ముడితో కూడా గదిలోకి వెళ్ళింది.

## ౧౫

"కానయితే నువ్వు మహా పొంగిపోయావుగాని నీ కోడలి పాదం మంచిది కాదమ్మా"

కొడుకు వుద్యోగం పోయినందుకే విచారిస్తూ వున్న తల్లిని యెత్తిపొడుస్తూ రాజమ్మ యిలా అంది.

"దా న్నలా అనకే. ఎన్ని వేల సంవత్సరాల తపస్సు చేస్తే మన కలాంటి పిల్ల దొరుకుతుందే?"

"తపస్సు కూడా చెయ్యాలి యినపగజ్జెల తల్లికోసం!"

ఇలా అంటూ తల్లి బుగ్గమీద పొడిచినంత పని చేసి నిప్పులు కక్కి, పళ్ళు కొరికి మళ్ళీ అందుకుంది రాజమ్మ.

"ఇనప్పెట్టిలో రెండు లక్షలున్న తండ్రిచేత నిక్షేపం వంటి మొగుడికి వొక్క దమ్మిడీ అయినా కట్నం యిప్పించలేకపోయింది. మొగుడికి కట్నం రావడమే తనకి గొప్పో, తండ్రి వ్రతమే తనకిగొప్పో గ్రహించుకో లేకపోయింది నీ విద్వాంసురాలు. దాని మూలంగా యేదో చిక్కు వస్తుందని నేను అప్పుడే అనుకున్నాను. సరి రానే వచ్చింది"

"ఆరు నెల్లయి అది వస్తే—"

"ఆరేమిటి, తొంభయ్యారేమిటి, నువ్వెన్ని చెప్పినా

సరే నీ కోడలు నాతమ్ముడికి శనిగాడు గాని మనోటికి కాదు. పండుగులికి యేవో జామారుగుడ్డలు తప్ప వొక్క గుడ్డి గవ్వ యెగురునా తమ్ముడు! తమకి మూడు మేడ లున్నాయి కదా మన కొకటి కాపరం వుండ మనేనా యివ్వకూడదూ? ఏమిచ్చినా తమ కూతురికే వుంటుంది కాని మన మేమీ మింగెయ్యంకదా? ఆరాణీ గారి కోసమే కదా నిక్షేపం వంటి యెనిమిదిరూపాయల భాగం విడిచిపెట్టి పదిహేను రూపాయల ఈయిల్లు మెడకి కట్టుకున్నాము? అగరువత్తులు, సెంట్లు, తాంబూలానికి తుని ఆకులే గాని పనికిరాకపోయె—''

"తన సరదాకొద్దీ అవన్నీ అబ్బాయి తెస్తున్నాడు; కాని తెమ్మని అది పురమాయించిందా యేమిటే పాపం.?"

"ఇంకా పురమాయించాలి. పురమాయిస్తుందేం? పురమాయిస్తే నే నూరుకుందునేం?"

"మన కింత యిల్లెందు కని కూడా—"

"అలా యెందు కందో నువ్వెరుగుదువు పాపం."

"......లైట్లు కూడా వొద్దంటే అబ్బాయే—''

"ఊరుకో నేర్చుకుపోయావ్! లైటులేక చీకటింటో యేడుస్తున్నా నని యాగీ చెయ్యడాని క్కాదూ ఆ

యెత్తూ! నీమాటలు వింటే నాకు మహా మండుకుపో
తోంది వొళ్లు."

ఆవృద్ధ్వృతం చూడలేక మహాలక్ష్మమ్మ మొగం వంచు
కుని కుతకుత లాడిపోయింది.

"పోనీ, అదలా వుంచు. ఇప్పు డేమిటి దారి?" అని
రాజమ్మ నిలవతీసి అడిగింది. దానిమీద "నేనేం చెప్ప
గలనే?" అంటూ ముసలమ్మ నెత్తీ నోరూ బాదుకుంది.

తరవాత, తల్లికేసి వురిమి చూస్తూ మరో నిమిషం
బుస్సలు కొట్టి రాజమ్మ తమ్ముడి దగ్గిరికి వెళ్ళిపోయింది.

ముసలమ్మకి దిక్కులు తెలవలేదు. "దా న్నంటే
పాపం వస్తుం"దని వొక వేపున. "ఏమో అమ్మాయి
చెప్పినట్టు దాని పాదం మంచిది కాదేమో!" అని మరో
వేపున.

నరా లన్నీ కుంగిపోగా, లేవలేక ఆమె కూచునే వుండి
పోయింది.

## ౧౬

ఆవేళ సాయంత్రం ఆరుగంటలికి, మహాలక్ష్మమ్మ వీధి
అరుగుమీాద కూచుని యెదటింటివారి పిల్లతో మాట్లా
డుతూ వుండగా కృష్ణవేణి వచ్చింది.

కారు రాగానే ముసలమ్మ లేచి నుంచుంది. "వస్తానండీ అమ్మమ్మగారూ" అంటూ చంటిపిల్లని చంకనేసుకుని ఆపిల్ల వెళ్ళిపోయింది.

కృష్ణవేణి వెంటనే కారు దిగివచ్చి పాదాభివందనం చేసి "కులాసాగా వున్నారా అత్తా!" అని కుశలప్రశ్న చెయ్యగా, ఆమె "కులాసాగానే వున్నా నమ్మా! మీరంతా క్షేమంగా వచ్చారా?" అంటూ కోడలిని కౌగిలించుకుంది.

రాజమ్మ వాకిట్లో తులసికోట దగ్గిర కూచుని వుంది. మడిగా వుండడం గ్రహించి, దూరంగా వుండి ఆమెకిన్నీ పాదాభివందనం చేసి కృష్ణవేణి క్షేమం అడిగింది.

ముగ్గురూ కొంచెం యెడంయెడంగా పోయిగడ్డల్లా కూచున్నారు.

అప్పుడు, ఆపిలుపళ్ళ బుట్టా, ద్రాక్షపళ్ళ బుట్టా తెచ్చి కృష్ణవేణికి దగ్గిరగా వుంచి, డ్రైవరు, సెలవుపొంది వెళ్ళిపోయింది.

ఆబుట్టలు చూశాటప్పటికి ముసలమ్మకి నోరూరిపోయింది.

"బజారంతా తిరిగి మీకోసం మంచి ఆపిలుపళ్ళు యేరి పట్టుకువచ్చా నత్తా! రోజు కొక ఆపిలూ, కసిన్ని

ద్రాక్షపళ్ళూ పుచ్చుకుంటే మీా కిక నీరసం వుండదు. ఇది కాబూలు ద్రాక్ష వదినా! పులు పేకోశానా వుండదు'' అని చెబుతూ కృష్ణవేణి యిద్దరి దగ్గిరా వాకొ్క్క ద్రాక్షపళ్ళగుత్తి వుంచి, ఆపిలుపళ్ళ బుట్టలో చెయ్యి పెట్టింద; కాని రాజమ్మ ''బుట్టలో వుండనియ్యి'' అంటూ ఆగుత్తికి దూరంగా జరిగింది.

ముసలమ్మ కడుపులో రాయి పడింది.

''ఏం వదినా!'' అని ఆశ్చర్యపడిపోయింది కృష్ణవేణి.

''అవి నేను పుచ్చుకోగూడదు''

''ఎంచేత నండీ?''

''సీమనుంచి వచ్చినవి బ్రాహ్మలు తినవచ్చా మరి?''

''ఇవి సీమనుంచి రాలేదండీ! బెంగుళూరిలోనే కాపిస్తున్నారు''

''విత్తనం సీమదేకాదూ?

''మా అమ్మమ్మ పుచ్చుకుంటుం దండీ! చయనం చేశారు మా పెద్దనాన్నారు కూడా పుచ్చుకుంటారండీ''

''వారు బంగాళా దుంప కూడా తింటారా?''

''ఆ''

''ఇంకేం? మీాది వుద్యోగస్థుల సంప్రదాయం. మాది కోనసీమఆయెను! తెలిస్తే మావాళ్ళు గుడ్లుపీకెయ్యరూ?

ముసలమ్మకి మంటెత్తిపోయింది. "ఏమిటే నీకీ పోయీ కాలం!" అనేద్దా మనుకుని, మాట నాలుక చివరికి తెచ్చుకుంది; కాని ధైర్యం చాలలేదు.

ఇదంతా గ్రహించి కృష్ణవేణి రాజమ్మ దగ్గిర పెట్టిన గుత్తి తీసి బుట్టలో పడేసింది.

దీనంగా చూస్తూ ముసలమ్మ తన కిచ్చిన గుత్తి కోడలి కందించింది.

వెంటనే కృష్ణవేణి ఆబుట్టలు రెండూ గదిలో పెట్టేసి వసారాలో వున్న గుడ్డకుర్చీలో పడుకుంది.

రాజమ్మ విజయగర్వంతో వంటింటోకి చక్కా పోయింది.

ముసలమ్మకి ఏడుపు వచ్చింది. ఆయేడుపులోనే శాస్త్రి వుద్యోగం పోయినసంగతి కృష్ణవేణికి చెప్పాలని తోచింది; కాని రాజమ్మ విషంచూపులు ఆమెని దిగతీసేశాయి.

వెంటనే ఆమె అక్కడే అలాగే పడుకుని మొగం కప్పుకుని లోపల్లోపల కుమిలిపోసాగింది.

ఏడున్నర అయాక రాజమ్మ వచ్చి తల్లిని స్నానం చెయ్యమని కృష్ణవేణిని భోజనానికి పిలిచింది.

"వా రేరీ వదినా?"

"వీరభద్రపురం వెళ్లాడు, పదయితే గాని రాడు"

"భోజనం—"

"అక్కడే చేస్తాడు"

ఇలా చెబుతూనే రాజమ్మ వంటింట్లోకి వెళ్ళిపోగా కృష్ణవేణి, మొగుడు బంతిలో లేకపోవడంవల్ల సగంసగమే తిని లేచివచ్చింది.

తరవాత ఆమె తమలపాకులు చిలకలు చుట్టి వొక గాజుపెట్టెలో వుంచింది. రెండు ఆపిలుపళ్ళు కోసి మరో గాజు బరిణలో వుంచింది. రెండు ద్రాక్షపళ్ళు నోట్లో వేసుకుని పుస్తకం పుచ్చుకుని కూచుంది. కాని నిద్ర ముంచుకు రాగా, ఆవలిస్తూ వెళ్ళి పడుకుంది.

రాత్రి పదకొండింటికి వచ్చి రాజమ్మతో గుసగుస లాడి శాస్త్రి కూడా నిద్రపోయాడు.

## ౧౬

మరి రెండు రోజులకు మునిసిపల్ హైస్కూలులోనే పనిచేస్తూ వున్న వొక స్నేహితుడు బజారు సమీపంలో కనపడి "నువ్వు ఆక్టింగు చేసిన పోస్టు మళ్ళీ కాళీ అయిపోయిందోయ్" అని చెప్పాడు.

"నాతో మరి సెలవు పెట్టనన్నాడే?"

"నిజమే. ఇదే చివరి సెలవు"

"అంటే?"

"ఇక యీపనిలో ప్రవేశించడు. ఆ పోష్టు శాశ్వతంగా కాళీ"

"అదేమిటోయ్?"

"మరొకడికి దఖలుపడుతుం దన్నమాట"

"ఎవరికీ?"

"ఆమనిషికి నామరూపాలు లేవు. ఇప్పటిమట్టుకి, నాకు, తంటాలుపడగలవాడికి నస్తుం దని తోస్తోంది"

ఇది విని యేదో ఆలోచిస్తూ వొకమాటు పైకి చూసి "మరి పనిలో యెందుకు చేరా డంటావ్?" అన్నాడు శాస్త్రి.

"అది బ్రహ్మభేద్యం. హెడ్మాష్టరుగారు కూడా తెలవక గజిబిజిపడిపోతున్నారు"

"ఇది శాశ్వతంగా విడిచేసి యేం చేస్తాడో?"

"ఇన్సూరెన్సు పనిలో నెలకి నూట యాభయి కిడుతున్నాయిట"

"హో! అలా చెప్పు మరి. అయితే, యిందులో యేదో కుట్ర వుం దన్నమాట"

"ఏదో అనుకోవాలి. తెనుగు జిల్లాలకు వొక బ్రాంచి యేర్పడబోతోం దనీ, ఆ బ్రాంచికి అతను సెక్రటరీ అయిపోతా డనీ అనుకుంటున్నారు"

"కావాలి, ముమ్మాటికీ కావాలి. చాలా సంతోషం"

"ఈమాటు నువ్వు గట్టి ప్రయత్నం చెయ్యాలి. నీ మామగారిని చెన్నపట్నం పంపి మంత్రిదగ్గిరనుంచి ఘాటైన వుత్తరం తెప్పించవోయ్"

"తప్పకుండానూ"

ఇలా అన్నప్పుడు శాస్త్రి మనస్సులో "లేకపోతే యీ చెయిర్మెనుగాణ్ణి బతకనిస్తానా!" అని అపరిమితమైన అహమిక మెరిసి పోయింది; కాని "సిఫార్సు చెయ్యగూడదు" దని తన మామగారికి శపథం వుండడం అత నెరగడు.

"పోనీ, నువ్వు కూడా యేదేనా యేజన్సీ చూచుకో రాదూ?" అన్నాడు సైకి లెక్కబోతూ స్నేహితుడు.

ఈ సలహా శాస్త్రికి కశాఘాతంలా కనపడింది. వెంటనే అతను చీదరించుకుని "వెధవ యేజన్సీలు పోనిద్దూ. తిండీ తిప్పలూ లేకుండా, రాత్రీ పగలూ అనకుండా నానా అపస్మారం మనుష్యులనూ ఆశ్రయిస్తూ దేవుళ్లాడాలి. ఆత్మగౌరవం పూర్తిగా విడిచిపెట్టెయ్యాలి.

అయినా, పని జరుగుతుం దని నిశ్చయం యేమిటీ? జీతం తక్కువ అయినా మేష్టరీ అయితే కడుపులో చల్ల కదల కుండా కూచోవచ్చు. కుర్రకుంకలికి చదు వంటనీ మానసీ మనకి పూచీ లేదుకదా? పైగా పరిగెత్తి పాలు తాగడం కంటే నుంచుని నీళ్ళు తాగడం మంచిది. ఇంతకీ టెన్నిస్ ఆడకపోతే నాకు నిద్రాహారాలు సయించ వోయ్! ఇన్స్పారెన్సు యేజన్సీ పుచ్చుకుంటే దర్జాగా అయిన టెన్నిస్ బాటు విడిచిపెట్టి వెధవ కాగితాలు మొయ్యాలి గ్ గాడిదలాగ" అంటూ చెందుకున్నాడు.

తరవాత "గుడ్ బై" అంటే "గుడ్ బై" అను కుంటూ వారిద్దరూ యెవరిదారిని వారు వెళ్ళిపోయారు.

సాయంత్రం ఆరు గంటలవేళ యిందుకోసం వెడు తున్నా నని రాజమ్మతో మాత్రం చెప్పి, శాస్త్రి, చెయి ర్మను దగ్గిరికి బయలుదేరాడు.

గుమ్మం దిగాటప్పటికి నీళ్ళబిందె బుజాన పెట్టుకుని పద్ధెనిమి దేళ్ళ బంగారు బొమ్మ యెదురు వచ్చింది.

"మంచి శకునం రోయ్! తొరగా అడుగు వెయ్యి" అని రాజమ్మ తొందరపెట్టింది.

నాళంవారి సత్రం దగ్గిరికి వెళ్ళాటప్పటికి పొద్దుటి స్నేహితుడే యెదురుపడి సైకిలు దిగాడు.

శాస్త్రి కూడా దిగాడు.

"ఎక్కడి కోయ్!" అని అడిగాడు స్నేహితుడు.

"అక్కడి కే" అన్నాడు శాస్త్రి.

"లాభం లేదు వెనక్కి మళ్ళు"

"ఏం?"

శాస్త్రి యీమాటక్క అక్షరమూ సరిగా వుచ్చరించ లేకపోయాడు. అతని గొంతుకు నొక్కేసిన ట్టయిపో యింది.

"ఆపోస్టు ముందు మరొకడి కిచ్చే తరవాత సెలవు మంజూరు చేశాడు చెయిర్మను"

"ఏమి టోయ్ నువ్వు చెప్పేదీ?"

ఇలా అడుగుతూ శాస్త్రి సైకిలుకి చేరబడి పోయాడు.

"తన మేనమామ అల్లుడి కిచ్చాడోయ్."

"వాడి మొఘం—"

"కలకల్లాడిపోతూ వుంది, దానికేం లోటూ? మరి పోతా."

"నాకు సలహా చెప్పు."

"ఆలోచించు. నువ్వు సామాన్యుడవా యేమిటి? నేను చెప్పవలసిం దొక్కటే. ఈచెయిర్మె నుండగా మునిసిపాలిటీలో నీకు చోటు దొరకదు."

"తాహతు లేనివాడు, కాగితాలోకడి దగ్గిరికి మోసుకుపోయి సలహా అడిగి తన అంతరాత్మకే వ్యతిరేకంగా సంతకం పెట్టే బానిస—"

"నువ్వు లక్ష అను. ప్రయోజనం లేదు. సింహాసనం మీద కుక్కే వుంటుం దనుకో. దానికే చెలామణీ."

గంట గణగణలాడించి స్నేహితుడు తుర్రుమన్నాడు.

## ౧౭

శాస్త్రి పదిహేను రోజుల కిందట బియ్యపు బస్తా అరువు తెచ్చాడు. బజారులో వెడుతూ వుంటే వర్తకుడు పిలిచి కొంచెం నిష్ఠురంగా మాట్లాడాడు.

మరో పది అడుగులు వేశాటప్పటికి యింటి యజమాని కనపడి "మా మాట మరిచేపోయారు. రెండు మాసాల అద్దె బకాయిపడితే తడిసి మోపెడై యివ్వడం కష్టం అనిపించదూ? పైగా, మీవుద్యోగం పోయింది ట కాదూ?" అంటూ మనస్సు పాడుచేసి విడిచిపెట్టాడు.

దీనికి సాయంక్లబ్బులో ఆవేళ యెంత శ్రద్ధగా— కసిగా ఆడినా టెన్నిసులో అతను లిగాడయిపోయాడు.

కొత్తవాళ్ళ బంతి కూడా తరుచు తియ్యలేకపోతూ వచ్చాడు.

అదివరకే గజిబిజిగా వున్న అతని మనస్సు పూర్తిగా చెడిపోయింది. చేసేది లేక లక్ష ఆలోచనలతోటీ కోటి విఘాతాలతోటీ అత నింటికి వచ్చాడు.

గుమ్మంలో అడుగు పెట్టాప్పటికి కోటూ, బూటూ పుచ్చుకోడానికి చేతులు చాపుతూ కృష్ణవేణి యెదురు వెళ్ళింది; కాని "అక్కర్లే" దని కొంచెం దురుసుగా చెబుతూ గదిలోనికి వెళ్ళిపోయాడు.

కృష్ణవేణి నిర్విణ్ణ అయిపోయింది. పది నిమిషాల పాటు ఆమెకి దిక్కులు తెలవలేదు.

దీంతో, అటు రాజమ్మా, యిటు భర్తా కూడా తన విషయంలో పూర్తిగా మారు దారిలో వున్నా రని ఆమె నిశ్చయించుకుంది.

వెంటనే యిదేదో ముదరకుండా సరిచేసుకోవా లని యింటోకి వెళ్ళింది.

ఏదో ఆలోచిస్తూ పడకకుర్చీలో కూచునివున్న శాస్త్రి, ఆమెను చూడడంతోటే గభీ మని లేచి యివత లికి బయలు దేరాడు.

"మాట" అంది ఆమె.

అక్కడే నుంచుని, మొగం మాత్రం వెనక్కి తిప్పి "ఎందుకూ!" అన్నా డతను.

ఇందులో కూడా ఆమెకి నిర్లక్ష్యం కనపడింది; అయినా సద్దుకుని "మీతో మాట్లాడాలి. పది నిమిషాలు మీ యింట్లో కూచోవాలి" అంది.

కృష్ణవేణి మంచానికి తల్లింపు దిక్కున ఆనుకుని నుంచుని వుంది. శాస్త్రి వెళ్ళి రెండో చివర ఆనుకు నుంచుని. "కూచో నక్కర్లేదు. అదేమిటో చెప్పు" అన్నాడు కొంచెం విసుగ్గా.

"మీరు చిరాకుగా కనపడుతున్నారు"

"అవును"

"ఏం!"

"మన స్నేమీ బాగా లేదు"

"కారణం?"

ఆమెకి, అతని మొగంమీద, మొదట "యేమయితే నీకేం!" అన్న వాలకం కనపడింది. చివరి కతను "ఉద్యోగం పోయింది. మళ్ళీ దొరికే సూచన లేమీ లేవు" అన్నాడు.

"ఎన్నాళ్లయిందీ!"

"మనం వచ్చిననాడే"

గతుక్కు మం దామె. "మరి నాతో చెప్పారు కా రేం!" అంది. ఆమాటలో కావలసినంత గద్గదిక వుంది.

"ను వ్వేమయినా తీరుస్తావా, ఆరుస్తావా?"

వెన కా ముందూ ఆలోచించకుండా అత నిలా అనే శాడు. దీనితో కృష్ణవేణికి మనస్సు చివుక్కు మని పోయింది.

"దాపరికాలు నా కిష్టం లేదు. మనస్సులోనే కుమిలి పోవడం నా పద్ధతి కాదు. నాసంగతి మీాకు మొదటే స్పష్టంగా చెప్పాను"

"అయితే యిప్పు డేమిటీ?"

"నాతో మీా రేమిా చెప్పనక్క ర్లేదూ?"

అతను మాట్లాడ లేదు. కనుబొమ్మలు బాగా ముడి వేసుకున్నాడు.

"మీా కష్టాలు మీా అక్క తీరుస్తారా? ఈ యింటి యాజమాన్యంతో ఆవిడ కేమి సమ్మంధం వుందీ?"

"ఈ యింటికి యజమానురాలవు నువ్వే? కాని యిప్పుడు సంసారం ఆవిడ పోషిస్తోంది. ఏ సంగతీ ఆవి డతో చెప్పక తప్పదు. ఆవిడతో ఆలోచించ కా వీలు లేదు. ఆవిడ సలహా పుచ్చుకోకా వల్ల కాదు. ఆవిడ చెప్పినట్టు నడుచుకోడం కూడా తప్పదు."

ఈమాటల్లో శాస్త్రి వుద్రేకం కనపరిచాడు. ఆమె యెడల బుద్ధిపూర్వకంగా తిరస్కారభావం కనపరిచాడు.

ఆమెకి చాలా కోపం వచ్చింది. కాని వొక్కమాటు మొగరొప్పడంతో అది చల్లార్చుకుని "నన్ను ఇప్పుడు పోషిస్తున్నది నాభర్తగారు కాదూ!" అని అడిగింది.

నిర్లజ్జగా "కా" దన్నా డతను.

ఇది వినలేక ఆమె చెవులు మూసుకుని మొగం వంచుకుంది.

ఒక్క క్షణం రెప్ప వెయ్యకుండా చూసి "కుదిరిందా?" అన్నట్టు విషపు మందహాసంతో శిరఃకంపమున్నా చేసి శాస్త్రి రివ్వున యివతలికి వచ్చేశాడు.

కృష్ణవేణి మొదలు నరికిన చెట్టులాగ మంచంమీద పడిపోయింది.

ఏమిటేమిటో మథనపడి వొక్కగంటకి ఆమె లేచేటప్పటికి గది అంతా అంధకారబంధురమై వుంది. వాకట్లో మాత్రం సన్నని మెరుపుదీపం వెలుగుతోంది.

వంటింటోకి తొంగి చూడగా శాస్త్రి భోజనం చేస్తున్నాడు. మరి రెండో పీటా విస్తరీ కూడా లేదు.

విస్తుపోయి కృష్ణవేణి పడమటింటి అరుగుమీద చతికిలబడిపోయింది.

కొంత సేపటికి ముసలమ్మ ఏవో గొణగడమూ, రాజమ్మ కసిరికొట్టడమూ, "కొన్నాళ్లదాకా నువ్వేమీ మాట్లాడకమ్మా" అంటూ శాస్త్రి విసుక్కోడమూ వినిపించాయి.

కృష్ణవేణికి కైజారుతో పొడిచినట్లనిపించింది.

## ౧౭

"ఒరేయ్, శాస్త్రీ" అని పిలుస్తూ శాస్త్రి చిన్న మేనమామ వీధితలుపు తోసుకుంటూ లోపలికి వచ్చాడు.

"ఇలా రావయ్యా బుల్లిమామా" అంటూ భోజనం చేస్తూనే శాస్త్రి స్వాగతం చెప్పాడు.

కృష్ణవేణి అతను పడమటింటోకి వెళ్లేదాకా నుంచుని మళ్లీ అక్కడే కూచుంది.

"ఒక్క క్షణం దాటిపోయింది. అయితే, నీకు దేవతార్చన బాధ లేదు కాదూ? మరి మడికట్టుకో" అంటూ రాజమ్మ కాళ్లు కడుక్కోడానికి నీళ్లిచ్చింది.

"నీ దయవల్ల నాకు దేవతార్చన యిబ్బంది లేక పోవడం నిజమే; కాని నేను భోజనం చేసే—"

మాట సగంలో అందుకుని రాజమ్మ తమ్ముడికేసి చూస్తూ "చూశావా!" అంది; కాని శాస్త్రి కేమీ కనపడలేదు. బోధాపడలేదు.

"నువ్వు కులాసాగా వున్నావా పెద్దక్కా?" అని ముసలమ్మని కుశలప్రశ్న.

"ఆ! పిల్లలూ మరదలూ నింపాదిగా వున్నారా?" అని ముసలమ్మ మారు ప్రశ్న.

ఉభయకుశలోపరి "ఏమిరా, యెవర్నీ పిలవకుండా నే పెళ్ళిచేసుకున్నావూ?" అని అడిగాడు మేనమామ.

"తొందర అయిపోయింది మామా"

"కాకపోయినా యింతోటి పెళ్ళికీ బంధువులు కూడా రావాలి, కట్నాలా, కానుకలా?"

ఝుమాయించి రాజమ్మ యిలా అనగా కనుబొమ్మలు ముడుచుకుంటూ శాస్త్రీ, నాలుక కరుచుకుంటూ మేన మామా మొగమొగాలు చూసుకున్నారు.

ముసలమ్మ తహతహ లాడిపోగా, రాజమ్మ, తమ్ముడి కేసీ మేనమామకేసీ విజయగర్వంతో చూసింది.

"బొత్తిగా కట్నం లేకుండా చేసుకున్నావుట యేమిరా!"

"అప్పటి కలా తోచిం దయ్యా"

"అదో తెలివి తక్కువ మాట" అంటూ రాజమ్మ దురుసుగా అందుకుంది. "వాడి మాటకేం, నేను చెబు తాను వినవయ్యా బుల్లిమామయ్యా! కట్నం యివ్వ కూడ దని వారికి గొప్ప వ్రతం ట. అంటే పీటలమీద చదివించ రనుకున్నాం కాని తరవాత యేదో విధంగా ముట్టచెప్ప రనుకున్నామా యేమిటి? ఎనిమిదో నెల వెళ్లనస్తోంది—"

"ఆహా! చాలా మంచిమాట" అన్నాడు మేనమామ.

శాస్త్రి లోపల్లోపల నవ్వుకున్నాడు.

ముసలమ్మ "ఇంకా లేదురా నాయనా" అంది మొగం వేలవేసుకుని.

"సడే" అని చెయ్యి జాడిస్తూ మళ్ళీ అందుకుంది రాజమ్మ. "ఇదిగో పులి అంటే నువ్వదిగో తోక అంటావు. మాకు అంత అదృష్టం కూడానూ. ఏదో శాస్త్రం చెప్పినట్టు—తరవాతి సంగతి విందూ. ఎనిమిదో నెల వెళ్ళవస్తోంది, యీక్షణానికి వొక్క దమ్మిడీ అయినా యెరగం; కాని రజస్వల అయిన పిల్లని చేసు కున్నందుకు వెలి మాత్రం చుట్టబెట్టుకుంది. కాకపోతే, యీవూరు వచ్చి నువ్వెప్పు డేనా అక్కడా అక్కడా భోజనం చెయ్యడం వుందా?"

"వెలి అంటే యేమిటి గానీ, నావంటి చాదస్తుల మాట కేం గానీ—పోనీ, వుద్యోగం ఖాయం అయినట్టా?"

"అస లుంటే గదా ?"

"అదేమిట్రా ?"

"మాతమ్ముడి కేముహూర్తాన మళ్లీ పెళ్ళి అయిందో గాని అప్పణ్ణుంచీ మాకు కష్టాలే వస్తున్నాయి. తమ్ముడికి వుద్యోగం ఆఖరయింది. మరోచోట మళ్ళీ దొరకలేదు. దొరికే దారి అయినా లేదు. ఏదో వచ్చి పడిపోతుం దని యెనిమిది రూపాయల యిల్లు విడిచిపెట్టి పదిహేనురూపాయలకి ఈయింటో పడ్డాం. రెండు మాసాల అద్దె బాకీ. చేతిలో దమ్మిడీ లేదు."

అప్పటికి శాస్త్రి భోజనం అయింది. మేనల్లుడూ, మేనమామా చల్లగాలికోసమూ, కబుర్లకోసమూ వీధి అరుగుమీదకి వెళ్ళిపోయారు.

ఒక్క క్షణం నిశ్శబ్దం.

తరవాత "మరి వడ్డిస్తున్నాను, నీకోడల్ని పిలుచుకో వమ్మా" అంది రాజమ్మ.

మహాలక్ష్మమ్మకి అప్పటికే నడుం విరిగిపోయి వుంది. కూతురు ధోరణికి "యేదో మునుగుతుం" దని ఆమె గగ్గోలు పడిపోతోంది; కాని యెవరికీ ఆమె లెక్క లేదు.

లెక్కడాకా యెందుకూ ఇప్పుడు వెళ్ళి కోడల్ని పిలవక పోతే కూతురు చీపురు తిరగేస్తుంది.

జడుస్తూ జడుస్తూ బయలుదేరింది. వాణికిపోతూ "అమ్మా! కృష్ణవేణీ" అని పిలిచింది.

"అమ్మా బొమ్మానూ" అంటూ లోపల రాజమ్మ సణుక్కుంది.

"ఎందు కండీ అత్తా!" అంటూ కృష్ణవేణి లేచి నుంచుంది. ఆమాటలో ఆదరగౌరవా లుట్టిపడ్డాయి.

దానికి పరమానందపడుతూ ముసలమ్మ "భోజనానికి రా తల్లీ" అని లాలనగా పిలిచింది.

"నేను భోజనం చెయ్యను. వెళ్ళి మీరు ఫలహారం చెయ్యండి."

"ఏమమ్మా ?"

"మీ కే తెలుసు. ఇక నాకు భోజనం మాట చెప్ప కండి అత్తా"

"బతిమాలడానికి నీ అబ్బ సొమ్మేమీ లేదిక్కడ" అంటూ లోపల రాజమ్మ పళ్ళు కొరుక్కుంది.

కళ్ళలో నీళ్ళు కుక్కుకుంటూ, తూలిపోతూ లోపలికి వెళ్ళి, కంఠం గుద్ధమయిపోగా మాట చెప్పలేక మహాలక్ష్మమ్మ కూతురికేసి బెదురుతూ చూసింది.

"చెప్పనక్కర్లేదు, నువ్వు కూచో" అంటూ తల్లిని

గదిమి, తల్లి విస్తరిలోనూ, తన విస్తరిలోనూ వుష్టా పిండీ వ్యంజనాలూ వడ్డించి, చెయ్యి ఆడక తల్లి కుసిల్లి పోతూ వుండగా రాజమ్మ నిర్విచారంగా ఫలహారం ప్రారంభించింది.

తొమ్మిది మ్మున్నప్పు వయాక మేనమామని సాగనంపేసి వచ్చి శాస్త్రి మంచంమీద గోడవేపుకి తిరిగి పడుకున్నాడు.

తరవాత పది నిమిషాల దాకా చూసి, దీపం తగ్గించి, తలుపులు అలా తెరిచేవుంచి కృష్ణవేణి తుంగచాపమీద పారిన్‌తివాసీ పరుచుకుని యిలా తిరిగి పడుకుంది.

ఆరాత్రి తెల్లవార్లూ నిద్ర అనేది యెరక్కుండా ముసలమ్మ మహా యేడ్చింది. రెండు గంటలవేళ బతిమాలి కూతురి ధోరణి మారుద్దామని లేచి కూచుంది; కాని గుండెలు తాళక గభీమని పడిపోయింది.

రాజమ్మ కూడా నిద్రపోలేదు. గది తలుపులు తీసి వుండడం గమనించి, వూరు మాటు మణిగాక మెల్లిగా వెళ్ళి, ఆమె, గదిలో వాలకం అంతా చూసి "కావాలి" అనుకుంటూ మళ్ళీ పడుకుంది.

## ౧౬

ఆవేళ పౌర్ణమి. పాఠశాలకి సెలవు. అయినా కృష్ణవేణి స్నానం చేసి దుస్తులు ధరించాటప్పటికి మామూలుగా కారు వచ్చింది.

"కాఫీ చేసుకుని పుచ్చుకోకపోతుందా!" అని రాజమ్మ వోరకంటితో చూస్తూనే వుంది; కాని కృష్ణవేణి ఆ విషయమే తలుచుకో లేదు.

ముసలమ్మ, కూతురు నూతికేసి వెళ్ళడం చూసి గబగబా కోడలి దగ్గిరికి వెళ్ళి "ఏమమ్మా, కాఫీ పెట్టు కున్నావు కావేం?" అంటూ రెండు చేతులూ పట్టుకుంది.

నిశ్చలంగా చూస్తూ "పుచ్చుకో తలుచుకోలేదండీ అత్తా" అని మృదువుగా బదులు చెప్పింది కృష్ణవేణి.

"ఏంతల్లీ?"

"నిన్న రాత్రి భోజనం కంటే యెక్కువదా అత్తా యీపూట కాఫీ?"

ముసలమ్మకి వొణుకు పట్టుకుంది.

"మా అమ్మవు కాదూ? మాతల్లివి కాదూ? నీరసం చేస్తుందమ్మా. నేను కుంపటి అంటిస్తాను, నువ్వు తొరగా కాఫీ చేసుకోమ్మా! చేసుకోకపోతే నన్ను చంపుకు తిన్నట్టే"

ఇలా అంటూ, మహాలక్ష్మమ్మ చేతులు విడిచిపెట్టి ఎడమచేత్తో పాదివి పట్టుకుని, కుడిచేత్తో గడ్డం పట్టుకు బతిమాలింది; కాని కృష్ణవేణి వినలేదు. పైగా "సర్వమూ మీకు తెలుసు. నన్ను నెపపెట్టకండి అత్తా" అని జాలిగా బతిమాలింది.

శాస్త్రి దంతధావనం చేసుకుని మొగం తుడుచు కుంటూ సరిగా యీ సమయంలో వచ్చాడు. అతన్ని అంత దూరానే చూసి, మహాలక్ష్మమ్మ కోడలిని విడిచి పెట్టి పక్కగా నుంచుంది.

శాస్త్రి రావడంతోటే గబగబా వెళ్లి కృష్ణవేణి కారెక్కింది.

కొడుకు పెడసరంగా మాట్లాడతా డని యెరిగి వుండీన్నీ వూరుకోలేక, ముసలమ్మ, ఆత్రంగా "కాఫీ పుచ్చుకోకుండా వెడుతోందిరా" అంది.

తల యెగరవేసుకుంటూ "ప్రపంచం తల్లకిందు లయి పోదులే" అన్నాడు శాస్త్రి.

"కొంప ముంచుకుంటావుట్రా?"

"ఇంత మాత్రానికే?"

"నిన్న రాత్రి అన్నం కూడా తినలేదురా వెర్రిపిల్లా"

"ఏమిటీ?" అంటూ కంగారుపడిపోయాడు శాస్త్రి. వీధి కేసి చూశాడు.

కారు కదిలింది.

అతని కాళ్ళు వొణికాయి.

"నిక్షేపం వంటి పిల్లరా నాయనా! తగువులు పెంచు కోకురా బాబూ! మాట పడే మనిషి కాదు రా అదీ. భాగ్యవంతుల పిల్ల కావడం అలా వుండగా, నీతో సమంగా చదువుకుంది రా. అయినా తెగనీలుగు లెరగదు రా—"

మాట కడ్డు వచ్చి "అక్క యేదీ?" అన్నాడు శాస్త్రి. మహాలక్ష్మమ్మ నూతిదొడ్డికేసి చూసింది.

రాజమ్మ వస్తోంది.

"నిన్న రాత్రి కృష్ణవేణి భోజనం చేసిందటే అక్కా?"

"లేదు."

"ఏం?"

"ఆకలి లేకపోయింది బాబోలు."

"అయ్యో" అంటూ నోరు నొక్కుకుంది మహాలక్ష్మమ్మ. దానిమీద, తల తాటించుకుంటూ "ఏమిటా వేషం?" అని రుంజుకుంది రాజమ్మ.

"నాతో చెప్పావు కాదేమే అక్కా?"

"చెప్పడాని కిందులో యే ముందిరా? అది యేం చేస్తోందో, యెందుకు చేస్తోందో కనిపెడుతూ కూచోడమే నా పనా? ఇంతకీ యేం వచ్చిం దిప్పుడూ?"

"కాఫీ పుచ్చుకోకుండా వెళ్ళిపోయింది"

"మానేస్తుం దనుకున్నావా? ఎన్ని శేర్లు తాగుతుందో అక్కడ!" అని మూతి ముడుచుకుని అడిగింది రాజమ్మ.

"అయ్యో, అయ్యో" అని లోపలే అనుకుంటూ ముసలమ్మ నింపాదిగా గుండెలమీద కొట్టుకుంది. రాజమ్మ అందుక్కూడా మళ్ళీ చర్రు మంది.

శాస్త్రి కిందులో చాలా అమానుషం కనపడింది; కాని అస్వతంత్రుడు, "తెగీదాకా లాగుతావే నువ్వు" అని మాత్రం అని అతను చివాట్లకి తల వొగ్గాడు.

"ఈమాత్రం భాగ్యానికే కంగారుపడిపోతున్నావా యేమిట్రా నువ్వు? దిట్టమైన మొగాడవే. ఇలా అయితే అది నీకు లొంగుతుందా?" అంటూ సాగతీసుకుంది రాజమ్మ.

"నువ్వు లొంగావా?" అని తనలోనే అనుకుంది మహాలక్ష్మమ్మ.

"చాలా దూరం వెడుతుంది వ్యవహారం" అంటూ మొగం వేలవేసుకున్నాడు శాస్త్రి.

"తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోతుం దనుకుంటున్నావా!"

శాస్త్రి మాట్టాడలేకపోయాడు.

"ఒక్కనాటి కలా చెయ్యదు. నాలుగు రోజులుంటుం దీ బెట్టుసరీ. తరవాత వచ్చి అది నీ కాళ్ళ మీద పడకపోతే నన్ను ఛీ అను. ఇదే సమయం, యిదే సందూనూ. కథ యిలా తిరుగుతుందా తిరగదా అని నే నెన్నాళ్ళనుంచో ఆదుర్దాపడిపోతున్నాను. నువ్విప్పుడు బిర్రుగా వుండకపోతే యెర్రని యేగాని వూడిపడదు"

శాస్త్రి వంచిన తల యెత్తలేదు.

"నాయనా! ఎవరికి కోపం వచ్చినా సరే, నే నొక్కటి చెబుతా విను" అని మొదలుపెట్టింది మహాలక్ష్మమ్మ. "నీరోజులు బాగా లేవు. అంచేతే నీ వుద్యోగం పోయింది. ఈసమయంలో కుటుంబకల్లోలం కూడా తెచ్చిపెట్టుకుంటివా, నీకు మతి పోతుంది. కోడలి దగ్గిర నువ్వు తప్పు చూపించలేవు. వీధికి వెడితే నలుగురూ నిన్నే అంటారు. నీ మంచి చెడ్డలు తెలవకుండానూ, తమ పిల్లని నువ్వెలా చూస్తావో తెలవకుండానూ—నువ్వు స్వతంత్రుడవో అస్వతంత్రుడవో తేలకుండానూ వారు అంత ఆస్తి నీ చేతిలో పెడతారు ట్రా వెర్రినాయనా? ఇంత వూళ్ళో యేదో వొక నౌకరీ సంపాదించుకోలేకపోతే అది నీచేతకానితనం అనిపించుకోదు ట్రా? మెరుపుదీపం వద్దందా? సెంట్లూ, అగరువత్తులూ మానుకుందా? అది

యెక్కడి కక్కడికే సర్దుకునే మనిషి కాని చిన్నప్పణ్ణుంచీ అంత వైభవం అనుభవించి వుండీన్నీ దేని కేనా నిన్నిబ్బందిపెట్టింది ట్రా పాపం? రోజూ నీ బంతికి పిలుస్తూ హఠాత్తుగా మానేస్తే దానికి చిన్నతనం కాదుట్రా? భోజనాలవేళ మామయ్యతో జరిగిన సంభాషణ అది విని వుంటే యెంత తప్పురా? ఎంత విషమిస్తుందిరా?"

ఇది విని "యేమీ మునిగిపోలేదు, యీ పాటికి చాలించు నీ వుపదేశం" అంటూ రాజమ్మ తల్లిమీద కళ్ళెఱ్ఱజేసింది. "వోరేయ్, తమ్ముడూ! నీకు వచ్చిన ఆపత్తేమీ లేదిప్పుడు. నాదీ పూచీ. కాస్సేపటికో కాస్సేపటికో నీ అత్తగారూ మామగారూ వస్తారు నువ్వు మాత్రం బేలపోకు. కచ్చితంగా మాట్లాడేసెయ్యి. కాపరం చెడిపోతే దానికే చిక్కుగాని నీకేమీ యిబ్బంది లేదు" అని ఝూంకారంగా చెప్పిం దామె.

శాస్త్రికి ధైర్యం కలగలేదు; కాని రాజమ్మని కాదనలేకపోయాడు.

మహాలక్ష్మమ్మ నూతిదొడ్లోకి వెళ్ళి, నెత్తీ నోరూ బాదుకుని కుమిలికుమిలి యేడ్చింది.

బుఱ్ఱ వంచుకుని శాస్త్రి కాఫీహోటలుకి చక్కాపోయాడు.

"ఈ దెబ్బతో పదివే లయినా తెస్తే గాని—వొక మేడ కూడా "యిచ్చాము తల్లీ" అనిపించుకు వస్తే కాని గుమ్మంలో అడుగు పెట్ట నివ్వను రాణీగారిని. అప్పుడు తెలుస్తుంది నా విలువ తమ్ముడికి" అని వెన్ను విరుచు కుంటూ రాజమ్మ గోదావరికి వేంచేసింది.

## ౨౦

తల్లినీ తండ్రినీ చూశాటప్పటికి కృష్ణవేణికి దుఃఖం ముంచుకు వచ్చింది; కాని మానవతి కనక అణిచేసు కుంది. అయినా, మొగం డీల్లపోయి వుంది.

కూతుర్ని చూశాటప్పటికి, రాధమ్మకి, మనస్సు చెయ్యి పెట్టి కలిచేసిన ట్టయిపోయింది. వెంటనే దగ్గిరికి వెళ్ళి "అలా వున్నా వేం తల్లీ?" అంటూ ఆమె కూతుర్ని పొదివి పట్టుకుంది.

"ఏం, యెలా వుందీ?" అని ఆదుర్దా పడుతూ యాజులు దగ్గిరికి వచ్చాడు.

పొదివి పట్టుకునే కూతుర్ని సోఫా దగ్గిరికి తీసుకు వెళ్ళి వొళ్ళో కూచోపెట్టుకుని, మొగం నిమురుతూ "కళ్ళు గుంటలు కట్టా యేమమ్మా!" అని రాధమ్మ అడగ్గా, "అవును, మాట్టాడ వేమమ్మా!" అన్నాడు యాజులు.

కృష్ణవేణి వేడి నిట్టూర్పు ఆపుకోలేకపోయింది. అక్క డికీ ఆమె యింకా ఆవేగం అణుచుకునే ప్రయత్నం లోనే వుంది.

"ఏదో బాధపడుతున్నావు. ప్రయత్నపూర్వకంగా దాస్తున్నావు. మొగం దిగాలుపడిపోయింది. ఎందేతో చెప్పవూ తల్లీ?" అంటూ పక్కని కూచుని యాజులు లాలిస్తూ అడిగాడు.

"తెల్లవారి లేచి కాఫీ పుచ్చుకోలేదు నాన్నా రూ" అంది కృష్ణవేణి పెదవులు తడుపుకుంటూను. తల్లి దండ్రుల ఆదుర్దా చూశాటప్పటికి కామె యిక గుట్టుగా వుండలేకపోయింది.

తల్లీ తండ్రీ వొక్కమాటే "యెందేతా!" అన్నారు.

"నిన్నరాత్రి భోజనం కూడా చెయ్యలేదండీ!"

ఆమె పెదవులు వొణికాయి. కళ్ళు చెమ్మగిల్లిపో యాయి. వెంటనే ఆమె తల్లిని చేరబడిపోయింది.

రాధమ్మా యాజులూ గడగడ లాడిపోయారు. "నీ ఆడబడు చేమేనా అందా యేమిటి తల్లీ!" అని రాధమ్మ అడగ్గా "అనే వుంటుంది. కోనసీమ జట్టు, మొదటే అనుకున్నాను నేను. ఏం జరిగింది తల్లీ, చెప్పవూ!" అని యాజులు కంగారుపడ్డాడు.

సరిగా యీ సమయములో సుభద్రమ్మ అక్కడికి వచ్చింది. "కాఫీ చేసి తొరగా తీసుకు రావమ్మా" అని యాజులు తొందరపెట్టాడు. సంగతి తెలవక కంగారు పడిపోయి, వొక్క నిమిషం అలాగే వుండిపోయి తరవాత వంటింటోకి పరిగెత్తింది సుభద్రమ్మ.

తనమీద వొట్టుపెట్టుకుని రాధమ్మ అనేకవిధాల అడగ్గా, కృష్ణవేణి వొక్కమాటు కళ్ళు మూసుకుని, మళ్ళీ తెరిచి తుడుచుకుని "చెబుతా నుండు" అ మళ్ళీ కళ్ళు మూసుకుంది.

"చెబుతుంది, చెబుతుంది కాస్త కాఫీ కంఠం పడనియ్యి" అని రాధమ్మతో అని "ఏం సుభద్రమ్మా, యింకా కాలేదూ!" అంటూ వంటింటోకి పరిగెత్తాడు. యాజులు.

"ఒక్క కప్పు కాఫీ వుంది. ఇది పుచ్చుకునేటప్పటికి మళ్ళీ చేస్తా" నంటూ సుభద్రమ్మ యెదురు వచ్చి, అది యాజులు చేతి కిచ్చి మళ్ళీ వెనక్కి పరిగెత్తింది.

యాజులు రాధమ్మ చేతి కిచ్చాడు. రాధమ్మ కృష్ణ వేణి నోటి కందించింది. కాస్త కాస్త చొప్పున రెండు మాట్లు చప్పరించి, తరవాత తానే అందుకుని, కృష్ణవేణి, వున్న దంతా రెండు గుక్కల్లో పుచ్చేసుకుంది.

రాధమ్మ కప్పు పుచ్చుకుని సోఫా కిందికి పెట్టి కృష్ణ వేణి మూతి తుడిచి కంఠం రాసింది.

తరవాత కృష్ణవేణి మొదట ముక్తాయింపు చెప్పేసి, తరవాత జరిగిందంతా వరాసగా చెప్పింది.

రాధమ్మ కొయ్యాయిపోయింది.

యాజులు అగ్గయి పోయాడు.

## ౨౧

యాజులు గంటలకొద్దీ ఆలోచించాడు; కాని కర్తవ్యం తేల్చుకోలేక పోయాడు.

రాధమ్మ యేమిటేమిటో చెప్పింది; కాని అతని మనస్సు కెక్కలేదు. "లోకానికి విపరీతంగానే వుంటుంది; కాని ఆడబడుచుపేనుగుని అవతలికి గెంటెయ్యగలిగితే అమ్మాయి కిక చిక్కు లుండవండీ అన్నయ్యగారూ" అని సుభద్ర చెప్పగా రాధమ్మ "అవు నండీ" అంది.

"సాధ్యమా?" అన్నాడు యాజులు. "ఈపుట్టిమునక కంతటికీ కారణం ఆవిడే అని యెవ రేనా గ్రహించ గలరు. అతను మన మాట వినీవాడైతే ఆమె అలా చెయ్యగలుగునా?"

కొంతసే పెవరూ మాట్లాడలేదు.

"నే నొకటి చెబుతాను వింటారూ?" అని మెల్లిగా అందుకుంది రాధమ్మ.

"ఏమి టది?" అన్నట్టు తండ్రీ కూతురూ ఆమె కేసి చూశారు.

"పోనీ, పదివేలు— "

"బుద్ధిలేనిదానా" అంటూ యాజులు మొగం పక్కకి తిప్పుకున్నాడు.

కృష్ణవేణి వుగ్రురా లయిపోయి, తల్లి కనక యేమీ అనలేక ధుమధుమలాడి వూరుకుంది.

"అలా చేస్తే మరీ లోకువ అయిపోతాం వదినా! నిజాని కీ కుట్ర అంతా డబ్బుకోసమే. సందేహం లేదు. కాని యిప్పుడు దమ్మిడీ యిచ్చినా సరే చివరి కావిడ ఈయింటో కూడా పెత్తనం తనదే అన్నంతవరకూ వెళ్ళిపోతుంది" అని సుభద్ర నచ్చచెప్పగా "అదీ నిజం లాగే కనపడుతోంది సుభద్రమ్మా! పూర్వజన్మలో యెంతమంది దంపతుల నేడ్పించిందో యిప్పుడు మొగుడు మొగం యెరక్కుండా ముండామోసింది. ఇప్పుడేనా బుద్ధి లేదు చూశావా? నాకూతురి కెన్నిపాట్లు వచ్చాయో చూశావా!" అంటూ రాధమ్మ బారు మంది.

"అదేమి టమ్మా" అంటూ కృష్ణవేణి, తల్లిని కౌగి లించుకుంది. "అయ్యో వదినా, యింత పామరత్వం

అయితే మెలాగా!" అంటూ సుభద్రమ్మ వీపు నిమురుతూ దగ్గిర కూచుంది.

"ఇప్పుడే వస్తా నమ్మా" అంటూ యాజులు మెదటింటి వకీలుదగ్గిరికి బయలుదేరాడు.

రాజమహేంద్రవరంలో, నేటివరకూ అంత గొప్ప వకీలు లేడని అతను గొప్ప పేరు పొందాడు. అయితే, ప్రస్తుతం రిటైరై, తన తాహతు ననుసరించి వాకిళ్ళకి పెడుతూ, తానున్నా అనుభవిస్తూ గ్రంథరచనతో కాలక్షేపం చేస్తున్నాడు.

యాజులుకీ అతనికీ మంచి స్నేహం.

యాజులు న్యాయాన్ని పూజిస్తాడు. అక్కడ అతనికి స్వపరభేదం లేదు.

వకీలు, మెదటివారిని పాయింటు దగ్గిర నిలబెట్టేస్తాడు. మరి ముందుకి వెళ్లనివ్వడు. అతనికి డొంక తిరుగుళ్ళు పనికిరావు.

వకాల్తీ చేసే రోజుల్లో, మెదటి వకీలు రోజులకొద్దీ వాదనచేస్తే అతను పాయింట్లు మాత్రం చూపించి కొన్ని నిమిషాల్లోనే కూచునీవాడు. యురపియన్ ఆఫీసర్లందరూ అతన్ని చాలా మెచ్చుకునీవారు.

అందుచేతే యాజులుకీ అతనికీ కలిసింది.

చివరికి వకీలు "అమ్మాయి కొన్నాళ్ళు అక్కడికి

వెళ్ళకుండా వుండడం మంచిది''అని తేల్చాడు. "అయినా ముందొకమాటు మాట్లాడడం చాలా అవసరం, వెళ్లి వస్తా"నని కూడా అన్నాడు.

పన్నెండు గంటలవేళ కృష్ణవేణీ వకీలూ బయలుదేరారు.

"కృష్ణవేణి మా కెలాంటి బిడ్డో మీకూ అలాంటి బిడ్డే కనక యెలా పరిష్కరించుకురావడాని కయినా మీరు సందేహించవద్దు. అమ్మాయి వొక గడువు పెట్టి వుంది. ఇది పరీక్షాసమయం కనక మీరు ఆస్తి సంగతి యేవిధంగానూ ప్రస్తావించవద్దు. లౌక్యాలు కూడా సాగనివ్వవద్దు''

యాజులు మోటారుతలుపు స్వయంగా వేస్తూ వకీలు కిలా చెప్పాడు.

ఇంటికి వచ్చాక రాధమ్మ "యేమవుతుం దంటారూ?" అని అడిగింది.

"మన అమ్మాయి మన యింటికి వచ్చేస్తుంది"

"కాపరం లేనట్టే?''

ఈమాట అడిగినప్పుడు రాధమ్మ కంఠంలో వొణుకు కనపడింది.

"అమ్మాయివల్ల లేశ మయినా తప్పుందా?"

"ఎక్కడో రాకాసి పీనుగు దొరికిం దండీ ఆడ బడుచూ."

"అల్లుడికి బుద్ధివుంటే ఆవిడ యేం చెయ్యగలదూ!"

రాధమ్మ మాట్లాడలేక పోయింది.

## ౨౨

శాస్త్రీ, మేనమామా, రాజమ్మా వాకట్లో కూచుని కభుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళ మాటలు విని సహించ లేక మహాలక్ష్మమ్మ యెదటింటికి పెత్తనాలకి వెళ్ళి పోయింది.

కృష్ణవేణితో వకీలు కూడా రావడం చూసి శాస్త్రి విభ్రాంతుడయిపోయాడు. రాజమ్మ గోడచాటుకి తప్పు కుంది. మేనమామ కళవళపడిపోయాడు.

శాస్త్రి తుంగచాప పరిచి "దయచెయ్యండి" అని వకీలుకి స్వాగతం చెప్పాడు.

కృష్ణవేణి వెళ్ళి గది గుమ్మంలో నుంచుంది.

"ఏమి సెలవు ? ఎప్పుడూ రానివారు దయచేశారు" అన్నాడు శాస్త్రి వినయం కనపరుస్తూనూ.

"ఎప్పుడూ రానివాణ్ణే కాని రాకూడనివాణ్ణి కాను. మీరెవరూ!" అని అడిగాడు వకీలు.

"మా బుల్లి మేనమామగా రండి."

"నన్ను రాజులుగారు పంపారు. అమ్మాయి పని మీద వచ్చాను"

"చిత్తం"

"నన్ను మీ రెరుగుదు రనే—"

"దివాన్‌బహద్దర్ నోరి పతంజలి శాస్త్రిగా రంటే దిశలు తెల్లవారతాయి. తమ యెదట పెరిగినవాణ్ణి ఎరక్కపోవడం యెలాగా?"

"మరి వచ్చిన పనికానిద్దాం"

"చిత్తం"

"దాంపత్యధర్మాలు చర్చకి రానివ్వడం విద్యాధికు లైన మీవంటి యువకులకు సరస మైనది కాదు"

"ఇప్పు డలాంటి దేమీ రాలేదు మహాశయా"

"పూర్తిగా వచ్చింది చిరంజీవీ!"

విభ్రాంతుడై "తమకిన్నీ అలా తోచడం ఆశ్చర్య కరమే" అన్నాడు శాస్త్రి.

"కా దని మీ నిశ్చయ మయితే నా సందేహాలు తీరుస్తారా?"

"తప్పకుండానూ"

"కాన్పేపటికో కూన్పేపటికో నీ అత్తగారూ మామ గారూ వస్తారు. నువ్వు మాత్రం బేలపోకు, కచ్చితంగా

మాట్టాడేసెయ్యి" అని పొద్దున్న రాజమ్మ చెప్పిన మాట అతనిప్పుడు పూర్తిగా నెమరుకి తెచ్చుకున్నాడు. దాంతో "మరి అడగండి" అన్నట్టు సిద్ధపడి ధైర్యంగా కూచున్నాడు.

వకీలు కంఠం సద్దుకుని ప్రారంభించాడు.

"పెళ్ళినాటికి, అమ్మాయి కృష్ణవేణి రజస్వల అయి చాలా రోజు లయింది దని మీ కందరికీ బాగా తెలుసు కాదూ?"

"చిత్తం"

"చిత్తం అంటే చాలదు, నాకు సూటిగానూ, స్పష్టంగానూ చెప్పాలి"

"తెలుసు నండి. అంతా అంగీకరించాము"

"యాజులుగారు, కట్నం యివ్వ మనీ, లాంఛనాలు కూడా యేమీ యివ్వ మనీ, తమ ఆస్తి యేవిధంగానూ యేమాత్రమూ మీకు దఖలుపరచ మనీ కచ్చితంగా చెప్పేశారు కాదూ?"

"అవునండి"

"నిన్న రాత్రి, భోజనాలవేళ మీతోడబుట్టిన ఆమె, మీ మేనమామగారితో మీ రెండోపెళ్ళిమాట ప్రస్తావిస్తూ "కట్నం యేమీ యిచ్చారు కా రనీ, తరవాత యేదో విధంగా ముట్టచెబుతా రనుకుంటే గుడ్డిగవ్వ

కూడా రాల్చలే దనీ, పైగా వెలి మాత్రం చుట్టబెట్టు కుం దనీ చాలా దురుసుగా చెప్పారు కాదూ?"

"నే నేమీ అనలేదే?"

"పోనీ, అది తగ దని ఆవిణ్ణి మందలించారా?"

"అయ్యో" అని మేనమామ అందుకున్నాడు.

"అది చిన్నపిల్ల. వీడూ చిన్నవాడే. ఏదో పొరపాటు వచ్చింది"

"అయితే, పెద్దలు కదా మీరు కూకలేశారా?"

"నా కెందుకు బాబూ వాళ్ళ గొడవలూ!" అని చేతులు దులుపుకుంటూ గోడకి చేరబడ్డాడు మేనమామ.

"కనక మీ రూరుకోండి. ఏమంటారు శాస్త్రిగారూ?"

"మందలించలేదు"

"ఏం, అగత్యం లేదా?"

"ఉంది; కాని మందలించలేదు"

"ఎనిమిదిరూపాయల యిల్లు పనికిరా దనీ, పదిహేను రూపాయ లైనా సరే ఈయింటో ప్రవేశించవలసిం దనీ అమ్మాయి మిమ్మల్ని నిర్బంధించిందా?"

"లేదు. పెళ్ళికి పూర్వమే మేమీ యింటో ప్రవేశించాము"

"పెళ్ళి అయింది మొదలు ప్రతీ రాత్రీ మీయింటో

అమ్మాయీ మీరూ యేకబంతిని భోజనం చేస్తున్నారు కాదూ?"

"ఎప్పుడేనా అలా జరక్కపోతే అది తగువా?"

"కారణం వుంటే కాదు"

"నిన్న అలాంటి యేర్పాటు లేకపోవడమే కారణం"

"అలాంటి యేర్పాటు లేకపోవడానికి కారణం?"

శాస్త్రికి జవాబు తోచలేదు. మేనమామ యేమయినా అందిస్తాడేమో అని అలా చూశాడు; కాని అతని మొగం యింకా వాలిపోయే వుంది. చితికిపోయిన అతని గుండెకాయ ఇంకా అతుక్కోనే లేదు.

"చెప్పండి" అని రెట్టించాడు వకీలు.

"చెబుతాను కానివ్వండి" అంటూ నాన్చేశాడు శాస్త్రి.

"ప్రతీరోజూ మీ అమ్మగారో, మీ అక్కగారో పిలిస్తేనే వస్తోందా అమ్మాయి, స్వయంగానే వచ్చి కూచుంటోందా?"

"పిలిస్తేనే"

"మరి నిన్న రాత్రి పిలవకపోడానికి కారణం?"

"నా యిష్టం. నన్ను ఆజ్ఞాపించడాని కెవరికి అధికారం వుందీ? అసలు నేను వండి వడ్డించకపోతే మాత్రం మెవరేం చెయ్యగలరూ!" అంటూ సణిగింది గోడచాటునుంచి రాజమ్మ.

అది అందుకుని "మా అక్క స్వతంత్రురాలు. ఆవిడ నామీాద ఆధారపడి వుండ లేదు. ఆవిణ్ణి ఆజ్ఞాపించడానికి నా కేం హక్కుండీ?" అంటూాశుకానువాదం చేశాడు శాస్త్రి.

అందుకు వకీలు మందహాసం చేశాడు. వకీలు తనని దద్దమ్మకింద కట్టేశా డని శాస్త్రి వుడికిపోయాడు.

"మీా అమ్మగారు వంటింటిలోనే వున్నారు కాదూ అప్పుడూ!"

"ఉంది; కాని వార్ధకంవల్ల వొకచోట చదికిలబడి పోయి వుంది."

"పిలవ్వొచ్చు కాదూ?"

"నిజమే, పిలవ్వొచ్చు. పిలవలేదు."

ఈమాట చెప్పినప్పుడు శాస్త్రి మొగం వాలిపోయి కిందిబారుగా అటూ యిటూ తిరిగింది.

"పోనీ, మీారు పిలిచారా?"

"అయ్యో! ఆడదాన్ని మొగాడు భోజనానికి రమ్మని పిలవడం యేమి టండీ?" అన్నాడు మేనమామ.

శాస్త్రి "అన్నట్టు మరే నండోయ్" అన్నట్టు చూశాడు. "ఊరుకుంటా వేమిరా?" అంటూ రాజమ్మ పళ్ళు కొరుక్కుంది. కృష్ణవేణి, "మేనమామ" ని మూాడో కంటితో చూసింది.

"మీరూ రూరుకోండి" అని మేనమామకి సాగతీసి బుద్ధి చెప్పి వకీలు అందుకున్నాడు.

"ఏమంటారు శాస్త్రిగారూ!"

"నేనూ పిలవలేదు. అయితే, బొట్టుపెట్టి పిలవ్వాలసిందేనా!"

"ఎనిమిద మాసాలనుంచి వొక్కనాడేనా మామూలు తప్పకుండా వుండి, హఠాత్తుగా నిన్ననే యెందుకు మానేశారూ!"

"సద్దుకోవాలి గాని ప్రతీదానికీ ఆరా తీస్తే యెలా గండీ?"

"సద్దుకోవడం అనేది అందరికీ అవసరమేనా!"

"అవసరమే"

"అయితే అమ్మాయి రాత్రి భోజనం చెయ్యలేదని మీకు తెలుసు"

"తెలవదు"

"ఏమిటీ!"

"నేను అడగలేదు"

"అడక్కపోవడమే మీపక్షంగా సద్దుకోవడమా?"

"..................."

"పోనీ యిప్పుడేనా తెలిసిందా!"

"అది పుట్టింటికి వెళ్లగానే తెలిసింది"

"పొద్దున్న కాఫీ కూడా పుచ్చుకోలే దని—"

"అదీ తెలిసింది. అదీ వెళ్లాకే"

"రాత్రి భోజనంమాట తెల్లవారీ దాకా తెలవ నప్పుడు పొద్దుటి కాఫీ సంగతి వెంటనే యెలా తెలుస్తుంది లేండి. ఇదలా వుండగా, రాత్రి అమ్మాయి తుంగ చాప పరుచుకుని పడుకుంది కాదూ!"

"అవును"

"ఏమని అడిగారా మీరు?"

"నన్ను బతిమాలుకో మంటారా?"

"అనలేదు. జరిగింది చెప్పండి"

"అడగలేదు. మీా కేం చేస్తా రేమిటి?"

కొంచెం దురుసుగా అన్నాడు శాస్త్రి యీామాట.

"ఏమీా చెయ్య"నంటూా వొక మందహాసం విసిరేసి "మీావుద్యోగం పోయిం దని అమ్మాయితో చెప్పారా?" అని అడిగాడు వకీలు.

"లేదు"

"మీా అక్కతో చెప్పారు కామూా!"

"చెప్పాను, ఏమిటి చెబితే !"

"ఏమీాలేదు. అమ్మాయి మీా కష్టసుఖాలు తెలుసుకోగూడనిదా?"

"........................"

"చెప్పండి"

"తెలుసుకోతగ్గదే"

"మరెందుకు చెప్పారు కాదూ!"

"అది నాయిష్టం"

"లక్షలు విలవ చేసే మాట. చూడండీ శాస్త్రి గారూ! ఇష్టం అన్నది ప్రతీ వ్యక్తికీ జన్మహక్కే కాదూ?."

నోరెత్తడానికి మేనమామకి దమ్ము చాలలేదు. రాజమ్మ కూడా తమ్ముణ్ణి వెనకవేసుకురావాలని చూసింది; కాని సాధ్యపడలేదు.

"ఇప్పుడు మీ సంసారం మీ అక్క పోషిస్తున్నారు. అంతేనా శాస్త్రిగారూ?"

"అంతే"

"సాయం చెయ్యమని మీరు కోరారు. కదూ?"

"లేదు. నా స్థితి గ్రహించి ఆవిడ స్వయంగానే పోషిస్తోంది"

"మీ వుద్యోగం పోయిందని మీరు చెప్పడంవల్ల ఆమెకి మీస్థితి తెలిసింది. అవునా?"

"అవునండీ"

"ఆవిడితో చెప్పినట్టే అమ్మాయితో కూడా చెబితే తల్లిదండ్రుల నడిగి యెంత డబ్బు—"

"దేహీ అని యాచించనా!"

"మీరు మాట తప్పిస్తున్నారు. నేను యాచించ మనలేదు. "మీఅక్కగారిని యాచించినట్టేనా!" అని కూడా అనలేదు. ఉద్యోగం పోయినట్టు—"

"అది చూడ్డం లేదూ!"

"మీ అక్కమాత్రం చూడ్డం లేదూ? ఆవిడకు మాత్రం నోటితో యెందుకు చెప్పారూ!"

"ప్రాణాంతకంగా వున్నాయే యీ ప్రశ్నలు" అని రుసరుస లాడుతూ అందుకుని మేనమామ, "వీటి కిక అంతం అంటూ లేదా యేమిటి? బాగానే వుంది ధోరణి" అన్నాడు.

ఈపునాదిమీద రాజమ్మ కూడా పురెక్కి "అడిగిన కొద్దీ వాజమ్మలాగ జవాబులు చెప్పడమే ట్రా? సిగ్గూ, బిడియమూ వుండొద్దూ? కాస్తయినా బుద్ధి లేకపోతే యెలాగా?" అని చాటునే వుండి కసిరింది.

శాస్త్రికి నవశక్తి వచ్చింది.

"అయ్యా! మీరు పెద్ద మనుష్యులే కాని, అనవసర ప్రస్తావన చేస్తున్నారు. నేను మీ కిక వొక్క ప్రశ్న కయినా జవాబు చెప్పను" అంటూ మూతి బిడాయించు కున్నా డతను.

"ఇక అక్కర్లేదూ. నేను తెలుసుకోవలసిన దాని కంటే అధికంగానే తెలిపించారు మీరు" అంటూ వకీలు కృష్ణవేణి కేసి చూశాడు.

## ౨౩

"మీరుండండి బాబయ్యా" అని కృష్ణవేణి అందుకుంది.

"ఏమండీ! భార్య అంటే బానిస కాదనీ, సమాన భాగస్వామిని అనీ, నాహక్కులు నేను పూర్తిగా అమలు పరుచుకుంటా ననీ మొదట్లో చెప్పాను కాదూ?"

"అయితే?" అన్నాడు శాస్త్రి నిర్లక్ష్యంగా.

"అవసరం వచ్చిం దని తోచినప్పుడు గృహిణికి వుండ వలసిన అధికారా లన్నీ నేను దఖలుపరుచుకుంటా ననిన్నీ అప్పుడు మీతో చెప్పాను కాదూ?"

"చెబితే?"

"ఇప్పు డలాంటి అవసరం వచ్చిండి కనక చెబుతు న్నాను. ఈ క్షణం మొదలు మీరూ, నేనూ మీ అమ్మా తప్ప మనయింటో మరో మనిషి వుండడానికి వల్లకాదు"

"నన్ను పొమ్మనడానికి నువ్వెవర్తివే? నువ్వెక్కణ్ణుంచి వచ్చావే?" అంటూ పళ్ళు కొరికింది రాజమ్మ.

"మా అక్క అవతలికి వెళ్ళిపోవా లంటావా నువ్వు?" అని అడిగాడు శాస్త్రి.

"నుంచున్న పాళంగా" అని వొత్తి చెప్పింది కృష్ణవేణి.

"వెళ్ళదు" అన్నాడు శాస్త్రి అంతకంటే వొత్తి.

"సరే అయితే"

ఇలా అని కృష్ణవేణి వీధి కేసి చూస్తూ "డ్రైవర్" అని పిలిచింది. "వచ్చా నమ్మా" అని వొక్క అడుగులో అత నక్కడ ప్రత్యక్ష మైనాడు.

మేనమామ తెల్లపోయాడు. తనని కొట్టేస్తుందో రాజ మ్మని గెంటేస్తుందో అని శాస్త్రి కొంచెం భయపడ్డాడు.

రాజమ్మ కంగారుపడుతూ తొంగిచూసింది.

అప్పుడు కృష్ణవేణి గదిలోకి వెళ్ళి తన సామాను చూపించి "కారులో పెట్టిరా" అని చెప్పగా "చిత్తం" అని డ్రైవరు రెండు సబురులు తిరిగాడు.

తరవాత కృష్ణవేణి "లేవండి బాబయ్యా" అంది.

"అబ్బాయీ, మీరు చాలా తొందరపడ్డారు. ఇంకా తొందరే పడుతున్నారు. చదువుకున్న వారితో యెలా మసులుకోవాలో మీరు నేర్చుకున్నట్టు లేదు" అంటూ వకీలు లేచి నుంచున్నాడు.

శాస్త్రి తల తిరిగిపోయింది. వెంటనే అతను వురిమి

చూస్తూ "యెక్కడికి వెడతావ్!" అని చొక్కా చేతులు పైకి తీసుకుంటూ గభీమని నుంచున్నాడు.

"ఓహో! ఇది మాత్రం నేర్చుకున్నారే" అని వకీలు నిరసించగా "వో—హో! నీకా సరదా కూడా వుందా?" అని పళ్ళు బిగించి తల పంకిస్తూ అందుకుంది కృష్ణవేణి.

మేనమామ తుళ్ళిపడ్డాడు.

"అయితే రా. మరి ఆలస్యం యెందుకూ? నేను నేర్చుకున్న జపాన్ కుస్తీ కిప్పటిదాకా వినియోగమే లేక పోయింది" అని ఆమె పంజా చాపింది.

చొక్కా సద్దుకుంటూ డ్రైవరు ముందుకి వచ్చాడు. కూచుని వున్న మేనమామ కూచుని వున్నట్టుగానే అతిలాఘవంగా వొక పిల్లిమంతరం వేసి వంటింటి గుమ్మం దగ్గిరికి పోయి నుంచున్నాడు.

శాస్త్రి బుస్సలు కొడుతూనే వున్నాడు; కాని కాళ్ళు వొణకసాగాయి.

అది చూసి రాజమ్మ "వొరేయ్, ఇంటోకిపోరా. కదల వేమిరా?" అని కంఠం నొక్కుకుంటూ కూకలేసింది; కాని శాస్త్రి అప్పటి కప్పుడే చతికిలబడిపోయాడు.

వెంటనే కృష్ణవేణి సీత్కారం చేసి "నువ్వింత అనాధ వని మే మెవరమూ అనుకోలేదు. సాటిఆడదాన్ని పెళ్ళి

చేసుకున్నందుకు నే నచాలా సిగ్గుపడుతున్నాను. ఇక నీ మొగం చూడను. చిక్కులు పెడితే కాపరం పోదులు కుంటుందా అనీ, డబ్బు పట్టుకు రాకపోతుందా అనీ ఆలో చించావు కదూ? నీవంటి వాజమ్మతోనా కాపరం! బి. ఏ. అయి వుండీన్నీ వున్న తాశయాలు లేక ఆత్మ గౌరవం లేక, ఆత్మవిశ్వాసం లేక గుడ్డిగవ్వకి మారని నీకా డబ్బివ్వడం? హిందూ లాలో విడాకుల సూత్రం లేనందుకు మురుస్తున్నా వేమో, నాకు మొగుడే కావా లంటే లక్ష మార్గా లున్నాయి తెలుసా? కబడ్దార్! డబ్బుకోసం గడ్డి తింటావా? నమ్మిన భార్యని ద్రోహం చేస్తావా? నీచుడా, అక్కా నీతో కాపరం చేసేది పెళ్ళామా? ఛీ, పురుగా'' అని శాస్త్రిని విసిరికొట్టి "రండి బాబయ్యా'' అంటూ క్రుద్ధకేసరిలా ముందు బయలు దేరింది.

వకీలు తరవాత బయలుదేరాడు.

వెనక్కి తిరిగి చూస్తూ డ్రైవరు ఆ తరవాత వెళ్లాడు.

కారు దగ్గిరికి వెళ్ళేటప్పటికి యెదటింటికి పెత్తనాలకు వెళ్లి వుండి యిదేమీ యెరక్కుండానే—మామూలు గానే యింటికి వస్తూ మహాలక్ష్మమ్మ యెదురుపడింది.

కృష్ణవేణి వెంటనే స్లిప్పర్లు దూరంగా విడిచి, "అమ్మా, ఇక మీ రెవరో నే నెవరో" అంటూ ఆవిడ పాదాలు పట్టుకుని కళ్ళ కద్దుకుని, మళ్ళీ జోడు తొడుక్కుని కారులో కూచుంది.

ముంగాళ్ళమీద నిక్కి చూస్తూ వున్న శాస్త్రి కిదంతా కనబడింది. "హోయి, పెద్దన్నయ్యా, ఇప్పుడేనా మనుష్యుల తారతమ్యం తెలిసిందా!" అని యెవరో వీపు మీద చరిచి నిలవతీసి అడిగినట్టు కాగా అత నప్రయత్నంగా వెనక్కి తిరిగి రాజమ్మకేసి దీనంగా చూశాడు.

"అమ్మ బతిమాలుతోందా యేమిటి!" అంటూ రాజమ్మ యెదటికి వచ్చింది.

అప్పటికి కంగా రణుచుకుని గద్గదకంఠంతో మహాలక్ష్మమ్మ యేదో అంది; కాని, బర్రు మంటూ కారు వెళ్ళిపోయింది.

౧౯౩౭ జనవరి

(సవరణలతో)